# ప్రాకృత వ్యాసమంజరి





"సరస్వతీ పుత్ర"

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు



బహుభాషా పండితులేకాక పుట్టపర్తి వారు బహుశాస్త్ర పండితులు కూడా. తర్క, వ్యాకరణ అలంకార శాస్త్రాల్లో నిష్ణాతులు. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలతో పాటు బౌద్ధం, జైనం కూడా అధ్యయనం చేశారు. ప్రాచ్య విద్యాధ్యయనం, సంప్రదాయ పాండిత్యం ఒకవైపు, ఆధునిక భావాలు మరోవైపు వారి బహుముఖ వ్యక్తిత్వానికి ఉదార భావాలకు తార్కాణాలు. వివిధ కళలతో వారికి పరిచయం వుంది. అవధానాలు చేశారు. నాట్యశాస్త్రంలో పరిచయం బాగా వున్న పుట్టపర్తివారు, సంగీతంలో కూడా నిష్ణాతృత్వాన్ని సంపాదించారు. పదసాహిత్యంపైన ఆయనకు ప్రత్యేకమైన అధికారం వుంది. స్వయంగా వాగ్గేయకారులుకూడా. పద్యకావ్యాలు, ద్విపదరచన, విమర్శనాత్మక వచన రచనలు, సంస్కృతరచనలు, మరాఠీ, హిందీ, మలయాళాల నుంచి అనువాదాలు చేశారు. ఆంగ్లంలో కూడా కొన్ని రచనలు చేశారు. సంగీత శాస్త్రంపై గ్రంధాలు వ్రాశారు.

పుట్టపర్తి వారికి అర్హతకు తగిన స్థానం, గౌరవాలు లభించలేదు. ఆశ్రయించటం వారి స్వభావంలో లేదు. వారికి లభించిన చిన్న చిన్న గౌరవాలు 'పద్మశ్రీ', 'డాక్టరేట్' వంటివి, వారి జీవితంలో చాలా ఆలస్యంగా లభించాయి. జ్ఞానపీఠం వంటి గౌరవానికి వారు నిజంగా అర్హులు. కానీ, అది తెలుగువాళ్ళ దురదృష్టం వల్ల లభించలేదు.

**ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి**

మాజీ, కులపతి, సెంట్రల్ యూనివర్శిటి, హైదరాబాద్.

# ప్రాకృతవ్యాసమంజరి



'సరస్వతీపుత్ర', 'పద్మశ్రీ'

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

# ప్రాకృత వ్యాసమంజరి

## ప్రాకృత సాహిత్య సమీక్షా వ్యాసాలు

'సరస్వతీపుత్ర' 'పద్మశ్రీ'
డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు


**DECEMBER - 2000**

ప్రతులు . 500

*ముద్రాపకులు :*
'సరస్వతీపుత్ర' కళాపీఠం
హైదరాబాద్

వెల · రూ. **40/-**

*ముద్రణ :*
పద్మశ్రీ గ్రాఫిక్స్
హైదరాబాద్
ఫోన్ : **7612283**

*ప్రతులకు :*
డాక్టర్ పుట్టపర్తి నాగపద్మిని
24-88/6, ఆనంద్‌బాగ్,
హైదరాబాద్ - 500 047.

# ప్రియోక్తి

చతుర్దశ భాషాగహన వీధుల్లో అవిశ్రాంతంగా తిరిగి, అసదృశ ప్రజ్ఞాపాటవాలనీ అలవోకగా సంతరించుకుని, శతాధిక రచనలను అతిసునాయాసంగా వెలార్చి, సరస్వతీ ప్రియపుత్రునిగా తెలుగు సాహిత్యసీమలో పేరొందినవారు - శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు మా అయ్యగారు. వారికి అజరామరకీర్తి నార్జించిపెట్టిన సంగీత సాహిత్య నాట్యవిన్యాసాలకోశం 'శివతాండవం' మొదలు 'మేఘదూతం' 'షాజీ', 'పాద్యము' వంటి రచనలెన్నింటినో, సొంతంగా ముద్రించుకునే ఆర్థిక స్థోమతలేక, నూరుకో నూటాయాభైకో ముద్రణకర్తలకమ్మి, అచ్చులో చూసుకుని ఆనందించేవారా "సరస్వతీ పుత్రులు" జీవితసంధ్యలో, వున్న కాస్త డబ్బుతో ధైర్యంచేసి వారు సొంతంగా ముద్రించిన గేయకావ్యం "జనప్రియ రామాయణం", బృహత్ పద్యకావ్యం "శ్రీనివాసప్రబంధం", ద్విపదరచన "పండరీ భాగవతం" తదితర గ్రంథాలు కడపలో మాయింటి అటకలపై యింకా అలుపుదీరుతూనే వున్నాయి జనప్రియ రామాయణ 'అరణ్యకాండ' సంస్కృత రచన 'శివకర్ణామృతము' యింకా ముద్రణ భాగ్యానికి నోచుకోనేలేదు 1950-60 ప్రాంతంలో 'భారతి','పరిశోధన' మొదలైన సాహితీ సంచికలలో ప్రచురితమైన వారి ప్రాకృత సాహిత్య వ్యాసాలను వారి శిష్యులు నోటు పుస్తకాల్లో వ్రాసియివ్వటం వాటిని అయ్యగారు తమ చెక్కబీరువాలలో భద్రపరచటం గుర్తు. అప్పట్లో జిరాక్స్ సౌకర్యం లేదు హాలుని 'గాధాసప్తశతి'లోని కొన్ని గాథలను మా అయ్యగారు నాకు పాఠం చెప్పేవారు. అప్పట్లో వారి అలనాటి వ్యాసాలను చదివి ప్రాకృత సాహిత్యసౌరభాలను ఆఘ్రాణించిన నాకు వాటికి ఎలాగైనా పుస్తకరూపం యివ్వాలని అప్పట్లో గాఢంగా అనిపించింది. యిన్ని రోజులకు అయ్యగారి బిరుదు ఆధారంగా రూపుదిద్దుకున్న "సరస్వతీపుత్ర కళాపీఠం" ప్రచురణగా ఆ వ్యాసాలకో రూపం రావటం ఆనందదాయకం. ప్రాకృత సాహిత్యాభిమానులు యీ వ్యాసమంజరిని ఆదరించగలరని ఆశిస్తాను.

భవదీయ

పుట్టపర్తి నాగపద్మిని

# కృతజ్ఞతలు


ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థికంగా సహకరించిన
సహృదయులకు వినయాంజలులు

**శ్రీ వెంకటరత్నం**
కాంట్రాక్టర్, తిరుపతి

**శ్రీ ఎ.డి. జగన్మోహన్,**
కాంట్రాక్టర్, హైదరాబాద్

**'కళాబంధు' శ్రీకావేటి ప్రసాద్,**
ఛైర్మన్ మరియు మేనేజింగ్ డైరెక్టర్, సుజి గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, హైదరాబాద్

**శ్రీ రాంరెడ్డి,**
ఛైర్మన్ మరియు మేనేజింగ్ డైరెక్టర్, ప్రియదర్శిని అడ్వర్‌టైజర్స్, హైదరాబాద్

**శ్రీ ఎ. రాఘవన్**
డైరెక్టర్ జనరల్, నేషనల్ అకాడమీ ఆఫ్ కన్‌స్ట్రక్షన్స్

**రాష్ట్ర సమాచార పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్**

# అనుక్రమణిక


| | | |
|---|---|---|
| 1 | ప్రాకృత కవిత | 1-6 |
| 2. | సేతుబంధము | 7-14 |
| 3 | సావయధమ్మదుహా | 15-23 |
| 4. | జసహరచరివు | 24-30 |
| 5. | కొన్ని సప్తశతులు | 31-52 |
| 6 | సంస్కృత నాటకాలలోని ప్రాకృతం | 53-64 |

# ప్రాకృత కవిత

రసికులమగు మనకు ప్రాకృత కవులు గట్టి యిచ్చిన పాథేయము వెలగలది మాత్రమే గాదు, చాల రుచిగలది గూడ గౌడ వహము, ఆదిపురాణము, సేతుబంధము, యశోధరచరిత్ర, మొదలగు కావ్యములు మెదడునకును, మనస్సునకును గూడ నానందమొసగునవి జైన బౌద్ధ వాఙ్మయములు, ప్రాకృత భాషలయందు విరివిగానున్నవి. నాటి సామాన్య భాష బహుశః ప్రాకృతమే యయి యుంటచే మతకర్తలు వానినే యాశ్రయించిరి. అందును, ప్రాకృతముల యందు, జైనమునకున్నంత వ్యాప్తి మరిదేనికినీ గానరాదు

ప్రాకృతభాషాపోషణమునందు ఆంధ్రుల కీర్తియు, లెక్కకు రానిదిగాదు. వారి సభలలో ప్రాకృతమును బోషించిరి కేవలము బోషించుటయేగాక దాముగూడ జేయిగలిగించుకొని బనిజేసిరి. రసఘుటికలవంటి మనోహరములగు జాటువుల నేర్చికూర్చి రూపమిచ్చిన శాతవాహనుడు మొదలగు వారాంధ్రులని యూహించుట కవకాశములున్నవి. "గాధాసప్తశతి"లోని చాల శ్లోకములలో, మన జీవితము, నాటియాచారములు ప్రతిఫలించియున్నవి. ఆ చాటువులయందసంఖ్యాకము లాంధ్రపురుషుల కుంచికలనుండియే యావిర్భవించినవి ఆంధ్రులకును, ప్రాకృతమునకును గల సంబంధము నాటిది నేటిది గాదు. జైన బౌద్ధములు దక్షిణాపథమువైపు, మొగదిరిగినది మొదలు ప్రాకృతమునాంధ్రరాజులు ప్రేమింప మొదలిడిరి. రసికతా ప్రియులగు నాంధ్రుల మనస్సులను, లలిత గంభీరమగునాభాషయే లోగొనజాలదనుట దెలియని తనము. చట్రాళ్ల బోలు సమాసములు, లలితోచ్చారణమునకు దావీయని కర్కశములగు వత్తులు మొదలగు వానితో "సదమదమై" యుండిన సంస్కృతముపై బెరిగిన యభిమానమును దిన్నగ జారియుండెను నాటినుండి, యాంధ్రుల యిండ్లయందు, ప్రాకృత భాషాజ్యోతులు వెలుగ మొదలిడినవి. కాని యా వెలుగు నిలిచినది కొన్ని దినములే. ఇంతలో దక్షిణాపథమునుండి, ద్వైత విశిష్టాద్వైతములు తన్నుకొని వచ్చినవి వారి వీరమతాభిమానమునకు, ప్రాకృతకావ్యములకు బొత్తు గుదరలేదు. జైన బౌద్ధముల ద్వేషించినదాక్షిణ్యాత్యుల కాభాషకు గూడ బహిష్కారము వేయక తప్పినది గాదు. దానితో సంపూర్తిగా ప్రాకృత జ్యోతులారిపోయినవి. కొన్ని ప్రాకృత శ్లోకములు, వేదాంత దేశికులవారు వ్రాసినవని ప్రచారములోనున్నవి. వానిలోని బంధము, గతి మొదలగునవి దృప్తికరముగ లేకపోవుటయేగాక, వికారముగా కూడ బరిణమించినవి. వానిని మరిదేశికులవారే వ్రాసిరో లేక మరెవరైన వ్రాసి వారి పేరతికించిరో చెప్పలేము ఒకవేళ వారే పూరించియుండినను, ప్రతిష్ఠ కొఱకై వ్రాసియుందురేమో గాని, యా భాషలయందలి సరసమగు సానుభూతితో మాత్రముగాదు. అంతవట్టు నిజము. వారి నాటకమునయందు ప్రాకృతమున్నది అయ్యది ప్రాచీనుల సంప్రదాయము ననుసరించి గతానుగతికముగ

వ్రాసినదియే. ఇంతకు సంస్కృత వాఙ్మయమున ప్రాకృతమును వాడి "భళీ" యనిపించుకొన్నవారలు, చాలమందిలేరు.

ఆంధ్రులకు ఆదినుండియు నంటివచ్చిన దురలవాటు యుపేక్ష. ప్రతిదానియందును నించుమించీ పరిణామమే గాన్పించును అందులో మతోద్రేక మొకటి తరుముకొని వచ్చినది. ఆయుపేక్షయు, నీమతపిచ్చియూ జేరి ప్రాకృతమును బారద్రోలినవి. ఆంధ్రులకుండిన ప్రాకృతాభిమానము క్రమక్రమముగా నన్నగిల్లి నశించినది కాగా నేటి "కాంధ్రులకును ప్రాకృతమునకును సంబంధముండెనా" యని సందేహించు పద్ధతికి దిగినది మనగతి చేతికి జిక్కిన కాణాచిని, నడువీధిలో గాలదన్ని, నట్టింట గూర్చొని యేడ్చు "దేబె" లైనాము. మనము, మన విజ్ఞానము, మన సహృదయత, కళా విదగ్ధత ప్రతిదియు ప్రాకృత భాషతో నంతరించినది. కడకు మనకు గల స్నిగ్ధ, లలిత గంభీరమగు ప్రత్యేకత నశించి, సంస్కృతమునకు దాసులై దానియడుగునీశల నడువవలసిన వ్రాత వ్రాసినది. మనమెంత యభాగ్యులము! అభిమానములేక, నిజమగు సహృదయతతో బరీక్షించు రసికునకు ప్రాకృత కవనమునకుముందు గీర్వాణ కవితయొకమంటి ముద్ద ప్రాకృతము శిరీషమధురకోమలము.

సంస్కృతము వజ్రకఠినము. అందులకే గౌడ వహకారుడు సంస్కృత ప్రాకృతములకు స్త్రీ పురుషులకున్నంత బేధము గలదన్నాడు. స్వభావ మధురమగు నాభాషలో దేనిని జెప్పినను, భాషా బంధమున భావబంధము రింగుమని మ్రోగును. పైగా వారి భావోన్నతి, కల్పనాచాతురి, స్వతంత్రత కన్నులల్లార్చి ధ్యానింపదగినవి. నాటి వాడుకభాష యదియగుట మరియొక విశేషము వారి స్వభావ వర్ణనలు మనకు బారెడు దూరములోగాక మానవ జీవితమునందైక్యమై యనగిపెనగినట్లుండును. కాని, మనకు వారి పలుకుదనమును, పదశక్తిని గమనించి యానందించు జీవశక్తి నశించినది. వారి భాష సరిగా నర్థముగాదు. అందుచే వారి భావములను గూడ మనము సరిగా గ్రహింపలేము. గీతిక చదివిన వెంటనే భావము మన యింటి ముంగిళ్ళ వరకు నడచి వచ్చినట్లుండును. కాని భాష బలవంతముగ భావమును దూరము లాగికొనిపోవును. ఇక మిగులునది హతాశ యొకటే ఇకనాటికి నేటికి గల యాచారములు చాలమారినవి పాశ్చాత్య నాగరికత యనునది ప్రాచీన జీవితమునకొక తెరయైనది. ఈ నాగరికత పల్లెపల్లెకును ప్రాకిపోవుచున్నది నేడు నెమలి పింఛమున జెక్కిన పల్లెపడుచు, గురువింద హారములు గూర్చుకొన్న క్రొత్తకోడలు, సింగాణి బుచ్చుకొని మొనగత్తెయై ముందునిలిచి, ఆముమిసలాడు సివంగుల జెండాడు బోయెత గానబడుటలేదు. వింధ్య శిఖరములపై ధనుస్సుల నూనుకొని క్రొత్తమేఘముల సోయగము జూచుచున్న పుళిందులవంటి యమాయికులు, నేడు బల్లెలలో గూడ కంటబడరు. ఈ రీతి వారి జీవితములోని లలితత, భావములలోని పనితనము, భాషలోని నయగారము మనకు దెలియకపోవుటచే, ప్రాకృతములోని తీపి మనసున కంటక బోయినది. చూడుడు

"జహిరసియ సింగాయి - ఉద్దరియ కండాయి
భుయదండ దక్కలియ - కోదండ దండాయి
లంబంత మాయూర - పింఛో వాణివసణహి
మసిధా ఉమండణయి - పిత్తల విహూసణయి
కడిబద్ధ చలచీరి - యాయంధ జాలాయి
కరధరియ విప్ఫురియ - కత్తియ కవాలాయి
పాయడి యణి యగురుక - మారూఢలింగాయి
కులఘొ సమయచమ్మ - పచ్చాయి యంగాయి
ముద్దా విశేశేణ - దూరంణ మంతాయి
పయఘుఘ్ఘురోతీహి - ఘువఘువ ఘువంతాయి
కవకవ కహంతాయి - పలియారవేసాయి
ముక్కట్ట హాసాయి - ఝుంపడియ కేశాయి
జహివిలిహ భేయాయి - కఉలాయిమిలియాయి
కోలంతి డడ్డరయి - అట్టంగ వలియాయి
జహికరడ పడహాయి - వజ్జంతి వజ్జాయి
ఇట్ఠాయి మిట్ఠాయి - పిజ్జంతి మజ్జాయి
... ...
... ...
మారీయె దేవీయె దేవాలయేతమ్మి (జసహరచరిఉ)

ఈనాడును పల్లెటూళ్ళయం "దూరి దేవతలు, జాతరలు మొదలగునవి జరుగుచూనే యున్నవి పోతలరాయని యార్భాటము, త్రావి కాంగ్రెస్సువారి దయచే నేడు దప్పినది గాని, తందనాలు ద్రొక్కువారి వెర్రికేకలు మనమెఱుగనివికావు కాని, యిత్తడితో గావించిన యాభరణములు, నెమలిపురులచే శేఖరములు, ముద్రావిశేషములు మొదలగునవి నేడంతరించినవి. భాష క్రొత్తది. ఆచారములు ప్రాతవైనను, మనకు క్రొత్తవి గావలసి వచ్చినవి. అందులకే మనకు వారి రచనలర్థముగావు. స్వభావ వర్ణనములే యిటులుండ నిక భావనానిబద్ధములగు నూహలు మాత్రము మనకర్థమగునా? వారు గ్రహించువస్తువులు బ్రహ్మాండమైనవి. వాటినాధారముగా గైకొని గావించు కల్పనలు మరింత గొప్పవి. అట్టి వర్ణనలు, తెలుగునందొక యాముక్తమాల్యదలో దప్ప, మరిదేనియందును గానరాలేదు దీనిబట్టి చూడ రాయలకు ప్రాకృతములయందు సంపూర్ణమగు నాదరాభిమానములును, గావలసినంతకన్న నెక్కువ పరిచయమును గలదని దోచుచున్నది. శ్రీనాథుడు "గాథాసప్తశతిని" దెనిగించినాడుగదా! అతనియందును, ప్రాకృత కవుల జాడలు బొడకట్టలేదు. బహుశః అతడు "పదకవి" యగుటచే, భావములపై నంతగా దృష్టినిడి, వానిననుకరింప యత్నింపలేదేమో? ప్రాకృత కవుల, కల్పనాచాతురికిని, వారి వస్తూన్నతికి నొక రెండుదాహరణములిత్తును.

"రవియరకే యరణివహం - సోహయి ధవలబ్బదల సహస్స పరిగయం మహో మహదంసణ జొగ్గం పితామహుప్పత్తి పంకయంవణ హయలమ్

ఛాయ :

రవికరకేసర నివహం, శోభతే ధవళాభ్రదళ సహస్రపరిగతం మధుమదన దర్శనయోగ్యం; పితామహోత్పత్తి పంకజమివ నభస్తలమ్

ధుయమేహమహుయరాఓ - ఘణ సమయాయద్ధి ఓ, ణయవి ముక్కా ఓ, ణహపాయవ సాహా ఓ, ణియ యట్ఠాణంలి పడిగయా ఓది శా ఓ

ఛాయ :

ధుతమేఘ మధుకరాః ఘనసమయాకృష్ణ అవనత విముక్తాః నభః పాదపశాఖాః నిజస్థానమివ ప్రతిగతా దిశిః.

పై రెండు శ్లోకములయందును, వస్తు గౌరవమున్నది. అనంతమగు గగనాడంబరమును పద్మమునకు బోల్చిచెప్పునపుడు మన భావన పరిమిత మగుటచేతనో, లేక మనకాశక్తియేనశించినదో జెప్పలేముగాని భావనాకల్పితమగు నాదృశ్యము నూహింపలేక తికమక లాడుదుము. ఆకసమొక వృక్షమట! ఘనసమయమను పురుషుడు దాని కొమ్మలను వంచినాడట మేఘములను తుమ్మెదలెగిరిపోయినవట. దిక్కులను కొమ్మలు సమయ పురుషుడు పట్టువిడిచిన వెంటనే, యధాస్థానమును జేరినవట ఓహోహో! ఇది యెక్కడి దృశ్యము! మేరు పర్వతము ముందు పిపీలికలవలెనున్నాము మనమీ భావనాశక్తియెదుట. ముసలియవ్వల, యాకుడుకధలు గ్రుక్కద్రిప్పక విను మనుమలవలె నిశ్చల నిబద్ధనేత్రులమై, చదువవలసిన వారమేగాని, మనభావనలా వస్తువుల నందుకొనుట మాత్రము సున్న. వారి వస్తూన్నతి వలెనే, కల్పనా చాతురియు మహోన్నతమైనది. పర్వతశిఖరమునందు విరిసిన సూర్యకిరణములవలె, బావనాశక్తియొక్క కడపటి తారపై ధ్వనించునవి వారి యలంకారములు. తీగెలు సాగవు. నక్షత్రములవలె తళుకు తళుకు మని మెఱయును చూడుడు.

"చందా అవధ వలాఓ పురంతదియరయణంతరియ శోహాఓ, సొమ్మే, సరయస్సఉరే - ముత్తావలవిబ్భమంవహంతి దిశాఓ."

ఛాయ :

చంద్రాతపధవలాః స్ఫురద్దివస రత్నాంతరిత శోభాః సేమ్యే శరద ఉరసి, ముక్తావలి విభ్రమం వహంతి దిశాః

శరత్కాలమున తెల్లని వెన్నెలచే గూడిన రాత్రులు ముత్యములైనవి సూర్యకిరణాంతరితములగు పగళ్ళు రత్నములవలె నున్నవట. శరత్కాలమనెడి

స్త్రీయొక్క యురమునందు, పరస్పర సంక్రమిత కాంతులగునీరాత్రింబవళ్ళు ముత్యాల పేరులైనవి. ఈ యలంకారములోని పనితనము భావుకుడూహింపగలడు.

ప్రాకృత కవుల ప్రకృతి వర్ణనలు రమణీయములు. రాగరాగ కవులు కవిసమయములను త్రాడులతో గట్టి ప్రకృతిని కుంటిదానిని గావించిరి. ఇంద్రధనువును జూచి ఋతుమదనబాణ చక్రముగను, నభోమందార నవకేసరముగను జూచి (సేతుబంధము) యానందించు రసికత, తారా ప్రకరణములను, గగన సముద్రము నందలి రజనివేలాలగ్నములగు ముత్తియములుగా భావించి యానందించు ఋషిత్వము (సేతుబంధము) మనలో నడుగంటినది. ఆకసమున గుంపులుగట్టి పారుచిలుక గుంపులను ప్రాకృతకవి యెంత మధురముగ భావించుచున్నాడు!

ఉయ పెమ్మ రాయమరగయ - సంవళి యాణహాయలా ఓ ఓ సరయి
ణహసిరి కంతబ్భట్ఠవ్వకంఠి యాకీర రింఛోలీ.

ఛాయ :

పశ్య పద్మరాగ మరకత సంవళితానభసస్తలా దవతరంతి
నభశ్శ్రీకంఠ భ్రష్టేవ కంఠికా కీరరింఛోళీ. (గాధాసప్తశతి)

ఇవియేగాక సాలీడులు, గిజగానిగూడులు, వెన్నెల పులుగులు మొదలగున వన్నియు వారికి కవితా సామగ్రియైనవి. ఆవర్ణించుటయందును నుబుసపోకకు మాత్రమేగాక రమణీయకతను, తీక్ష్ణ పరిశీలనమును దూచినింపుదురు. సేతుబంధకారుడు, శరదృతువును వర్ణించుచు "దరశుష్కచ్ఛవింవహంతీవ దివసాః" అన్నాడు. సూర్యకిరణములు సరిగ ప్రసరింపక ప్రసరింపకయు పోక, తడితడిగా నున్న దివసముల జూచి గావించిన మర్మోద్ఘాటన మది. వేరొకచోట, శరదృతు చంద్రుని వర్ణించుచు

పజ్జత్త సలిలధోయే దూరాలోక్కంత ణిమ్మ లేగయణయలే అచ్చాసణ్ణం వఠియం వి ముక్క పరభాయ పాయడం ససిబింబం.

ఛాయ :

పర్యాప్త సలిలధేతే, దూరాలోక్యమాన నిర్మలే గగనతలే అత్యాసన్న మివస్థితం విముక్త పరభాగ ప్రకటం శశిబింబం.

మబ్బులు మూసికొనకుండుటచే దిక్కులు వెనుక కొదిగినవి. కాగా చంద్రుడు భూమికి దగ్గరగా దిగినట్లును, గగనము వెనుకకు జరిగినట్లును గనబడుచున్నది. అనగా, చంద్రమండలమును మనకు కంటబడనంతటి సన్నని సాదనముతో గగనాంగణమునుండి క్రిందికి వ్రేలాడదీసినట్లున్నదని తాత్పర్యము. ఈరీతి చాల గంభీరమగు తీక్ష్ణదృష్టి ప్రాకృత కవులయొక్క ముఖ్యలక్షణము.

వీరియందు భావదాస్యమనునది మందునకైనను గానరాదు. "నూతనత"యను ధర్మము లేనిది, ప్రాకృతకవి కలముబట్టడు. కరకాండములు, ముఖకమలములు యెక్కడవో గ్రహములు వక్రించిననేదప్ప మనదారికడ్డుదగులవు. రాముడు దర్శించిన సముద్రము కార్యారంభమునకు ("కార్యారంభస్య యేవన మివ సముద్రం" సేతుబంధము) యౌవనమువలె నుండెనట. రామబాణములచే ఘూర్ణితమగు సముద్రము (అనంతరం శరనిర్భిన్నో- వడబాముఖ విద్యుత కేసర సటోద్ఘాతః, ఉద్ధార వితో రసన్, విశ్వస్త ప్రసుప్త కేసరీవ సముద్రః" సేతుబంధము) విశ్వప్త ప్రసుప్త కేసరివలె గానవచ్చినది కవికి. ప్రభాతమున తరంగ సంగతమై చలించు చంద్రబింబము, కింకర్తవ్య విమూఢ మయి చలించు శరధి హృదయమైనది. ("కింకర్తవ్యవిమూఢం ఘూర్ణీతి హృదయ మివోదధేః శశిబింబమ్" - సేతుబంధము). ఇంకనూ ఇట్టి సాతంత్ర్యమును అలంకారములయందు, పలుకుదనమునందు, కడకు భాషా నిబంధనములయందును బాటించినవారు ప్రాకృతకవులు. అన్నియు విస్తృతముగ విమర్శింప నీచిన్ని వ్యాసమున నసాధ్యము స్థూలారుంధతీ న్యాయమున జూపితినంతే!

ఇట్టి మహత్తరమై యుత్తమోత్తమమగు కవితను జదువని రసికులెంత దురదృష్టవంతులు? అంతయో, యింతయో నధికారము గలిగి, ప్రాకృతమునందును నాంధ్రులున్నారనిపించిన మనపూర్వులెంత ధన్యులు! చేతికి దొరకిన రస ఘటికలను జారవిడుచుచున్న మనమో .... చాల యభాగ్యులముగాదా!

*(భారతి, మే 1939)*

# సేతు బంధము

ప్రాకృత వాఙ్మయమునందు చాలమంది చదువునదియు, చదువదగినదియు సేతుబంధకావ్యము. దీనికి "దహముహవహ" మనియు మారుపేరు. శ్రీరాములు సేతువు గట్టి నుద్యమించుట మొదలుకొని, రావణుని వధ పర్యంతమిందు సరస గంభీరముగ వర్ణించినాడు కవి. ప్రాచీన లక్షణకారులు, సేతుబంధములోని శ్లోకములనుదహరించిరి. క్షేమేంద్రుడు సంస్కృత వాఙ్మయమునందు, మహాప్రసిద్ధుడుగదా! అతని లక్షణ కావ్యములయందెన్నియో సేతుబంధములోని శ్లోకములనుదహరించినాడు. మహాకవియగు భట్టబాణుడు, ముక్తకంఠముతో, సేతుబంధకారుని బొగడెను. (కీర్తిః ప్రవర సేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా సాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా॥) అంతటితో దనివి తీరలేదు. తన వచనరచనమున కెన్నియో మనోహరములగు నలంకారములు, మర్మోద్ఘాటనములగు భావములు యెరవు తెచ్చుకొనెను. అమరుకుడు భవభూతి, భారవి మొదలగు మరికొందరు, ప్రాకృతకావ్యములను, ముఖ్యముగా సేతుబంధమునాదరించిరి. ప్రాకృతములోని గభీరత భవభూతియందును, శృంగారలోలుపత యమరుకునియందును, సామాన్యత (simplicity) (భారవి ౪ సర్గమొదలుకొని) యందును మనకు స్పష్టముగా కంటబడును. ధ్వనికారునకు బ్రాకృతముపై గొంత యభిమానపువాసన యున్నట్లే యున్నది. అతడు గాధాసప్తశతిలోని చాలశ్లోకముల నుత్తమధ్వని కుదాహరించెను. అట్టి యెడ ప్రసిద్ధతమమగు సేతుబంధములోని దొక్క కావ్యము నైనను నుహరింపలేదేల? నాకు దోచునదిది. అతడు ప్రధానముగ ధ్వనిని నిరూపించుటకు గానే గ్రంధము నారంభించెను. ముక్తక కావ్యముల (చాటువుల) యందున్నంత ధ్వనిపుష్టి సాధారణముగా మహా కావ్యాంతః పాతితములగు రచనలకుండదు. ఒకవేళ నున్నను, పూర్వాపర సందర్భముల నుదహరించుటయు నవి సరిగా పాఠకుని కర్థము గాకుండుటయు సంభవించును. అందులకుగాను బహుశః పరస్పర సంబంధములేని ప్రత్యేక మనోహరములగు చాటువుల నుదహరించెను. సంస్కృతమునందలి శ్లోకముల నెత్తునపుడు, మహాకావ్యాంతర్గతములనే స్వీకరించెను. అందులకు గారణము స్వతంత్రములగు చాటువులయొక్క యభావమే. అమరుకము శృంగారమాత్ర విశ్రాంతము. సూర్యశతకము మొదలగునవి భక్తియందే నిమగ్నములు. గోవర్ధనాచార్యుల సప్తశతి యర్వాచీనమని నాయనుమానము. కాగా, ప్రాకృత కావ్యములయందలి ముక్తకముల నుద్ఘాటించుటయు, సేతుబంధమును విడుచుటయు సకారణమేగాని వేరుగాదు. మహాకవియగు కాళిదాసుని రచనలలో, ప్రాకృతవాసన సంపూర్తిగా నిండియున్నది. అతనివలె ప్రాకృతము వ్రాసినవారు సంస్కృత వాఙ్మయమున లేరు. కాళిదాసుని ప్రాకృతమును మనము చదువుచున్నపుడు సంస్కృత నాటకమునుగాక స్వచ్ఛమగు ప్రాకృత వచన కావ్యమునే జదువుచున్నామనిపించును. బంధచ్ఛాయగూడ ప్రాకృతమువలెనే ప్రాకృతశ్లోకములయందు నడపును ఉదాహరణము జూడుడు .

అహిణవ మహులోళువోతుమం,
తహ పరిచుంబియ చూయి మంజరిం,
కమళ వసదిమెత్తణి వ్వుదో
మహుయర విహ్మరి దోసిణం కహం

(అభినవ మధులోలుప స్త్వం తథా పరిచుంబ్య చూతమంజరిం కమల వసతి మాత్ర నిర్వృతో మధుకర! విస్మృతోస్యేనాంకథం)

ప్రాకృతమునయందు వత్తులు తక్కువ, కఠినాక్షరములుచ్ఛారణమునందు మారిపోయి తేలికగా పరిణమించును. సంస్కృతకవులకి లలితబంధమలవాటు గాకపోవుటచే ప్రాకృతమున వ్రాసినను సంస్కృత బంధములోనికే పాకముదింపుదురు. భవభూతి మహాకవి ప్రాకృతమును జూచిన నీభేదము బాగుగా బోధపడును. (ముఖ్యముగా మాలతీ మాధవములోని ప్రాకృతమును జూడుడు) పై శ్లోకమట్లుగాక, చాల లలితలలితముగా నున్నదై, యచ్చముగా బ్రాకృతశ్లోకమే యనిపించుచున్నది. శాకుంతలములో నతడు వాడిన ప్రాకృతము చాల విశుద్ధము. అనేకమందికి వరవడిగా నుండదగినది. అపభ్రంశ భాషలయందును, నితరములగు ప్రాకృతములయందును, మహాకవి యద్వితీయుడు అతడు సేతుబంధము నవశ్యము జూచియుండును. చాల సూక్ష్మముగా బరిశీలించినచో, సేతుబంధకారుల రచనలలోని మేలిమి కాళిదాసుని కావ్యములలో నవశ్యము గానిపించును. కుమారసంభవములో గొన్నిచోటుల స్పష్టముగనే యున్నది. కొంతమంది కాళిదాసునికన్న సేతుబంధమర్వాచీనమందురు. నాకీ వాదముపై నమ్మకములేదు. ఈ విధముగనే సంస్కృత వాఙ్మయమున "యశోధర, చరిత్ర" కును నన్యాయము జరిగినది. అశ్వఘోషుడే కాళిదాసుననుసరించెనన్నారు. ఈ పంథనే యాశ్రయించి భాసుడు కాళిదాసు కన్న నర్వాచీనుడనియు, నతడే కాళిదాసుననుసరించె ననియు నొక విపరీతవాదము బయలుదేరినది. (The poetry of Bhasa (Poona Edition) ఇట్టివి కేవలము అభిమానములను బురస్కరించుకొని యావేశముతో వ్రాసిన వ్రాతలే కాళిదాసు ఒకవేళ మరియొకరి ననుసరించె నన్నంత మాత్రమున నతని కీర్తికి లోటురాబోదు. వృధాభిమానముచే నసత్యము నొప్పింప జూచుటకంటె సత్యదృష్టితో సాహిత్యసేవ నొనరించుట మేలు. కావ్యరంగమును ఖడ్గరంగముగ మార్చుటకన్న నసహ్యములేదుగదా! నాయభిప్రాయమున కాళిదాసు సేతుబంధకారు ననుసరించినాడు తక్కిన సంస్కృత కవులును గొంతవరకు ప్రాకృతము ననుసరించిరని ముందే విన్నవించితినిగదా! వారిలో గొందరూరక చదివినవారు. మరికొందరు చదివినదానిని నాజూకుగా నర్థముచేసికొనకయు, సరిగా సంస్కృతమున బొందింపలేకయు దికమకలాడినవారే! అది యట్లుండె.

గ్రంథమింత ప్రసిద్ధముగదా! దీని కర్త యెవ్వరని ఆలోచించితిమా యదియును ననిర్ధారితమే. కొందరు ప్రవరసేనుడన్నారు. ప్రవరసేనులు నలుగురున్నారు. ఏ

ప్రవరసేనుడు సేతుబంధకర్త? మరికొందరు ప్రవరసేనుడు భోజదేవుడని వాదింతురు. ("ప్రవరసేనో భోజదేవ" ఇతి కశ్చిత్ - రామప్రదీపము) లేదు. కాళిదాసే సేతుబంధమును వ్రాసినవాడు ప్రవరసేనుని పేరూరకయుంచబడినదంతే నని యింకకొందరందురు రామసేతు ప్రదీపమనెడు సేతుబంధ కావ్య వ్యాఖ్యాన గ్రంథమందు

"ధీరాణాం కావ్యచర్చా చతురిమ
విషయే విక్రమాదిత్యవాచా
యంచక్రే కాళిదాసః కవి కుముదవిధుః
సేతునామ ప్రబంధం"

అని కలదు. ఆ గ్రంథమందే యాశ్వాసాంతమందు "ఇయసిరి పవరసేణ విరయియే కాలిదాసకమే, దహముహ వహే మహాకవ్వే"యని ముగింపబడినది. కాని యీ వాదము కేవలమర్థములేనిది గ్రంథకర్త పేరు తెలియని యేకావ్యమున్నను, నదియొక గొప్పకవి కంటగట్టుట మనవారి యాచారము కొంతమంది స్వార్థత్యాగులు, శతవికారములగు గ్రంథములను వ్రాసి, వాటినిగూడ పెద్దవారి కంటగట్టి పుణ్యము వడయుదురు ఇట్లే, కాళిదాసుని పేరిటనెన్నో మహాహీనములగు కావ్యములు ప్రచారములో నున్నవి. లంబోదర ప్రహసనము, రామకృష్ణవిలోమ కావ్యము మనకెదురుగా గనబడుచునేయున్నవి ప్రసిద్ధిని మాత్రమే యాకాంక్షించు పరమ దుర్మార్గులు సేయు కార్యములవి. వారికి పాప శంక సున్న, సహృదయత, రసికత మందునకైన గుండెలలోనున్న, వారట్లు చేసియుండరు. కాగా సేతుబంధమును కాళిదాసు వ్రాసియుండెననుట చాల నపహాస్యకరము సేతుబంధ రచనకును, కాళిదాసు కూర్పునకును గల యైక్యతకన్న, భిన్నత యెక్కువ సేతుబంధకారునకు, భావనాగమ్యములగు (Abstract Ideas) భావములపై మిక్కిలి మక్కువ కాళిదాసుని రచనయందెచ్చటనో తప్ప వాపోకడలుగానము. మహాకవికి చిత్రనిర్మాణముపై నున్నంత యభిమానము (కొన్ని యుదాహరణములు : కార్యసైకత (శాకుంతలము) తన్వీశ్యామ (దూత), సదేవదారు (కుమార సంభవము). పాఠకుని భావనకు పరిశ్రమ నొసగుటయందులేదు ఇది యీతని కావ్యముల నాస్వాదించు రసికులెల్లరు స్పష్టముగా ననుభవింతురు. ఒకవేళ, కాళిదాసే సేతుబంధము వ్రాసియున్నచో, నతని శృంగార లోలుపత యెచ్చటనో యొకచోట బరిమళించియే యుండెడిది. సేతుబంధమునందు శృంగారమునకగ్రతాంబూలము లేదు. అట్టియెడ కాళిదాసు, తనకభిమానమగు రసమునకు జోటులేని కధావస్తువును గైకొనియుండునా? ఇంకొక విషయమేమన, కాళిదాసు వీరరసమును సరిగా బోషింపలేదు. రఘువంశమునందాతడు వర్ణించిన యుద్ధవర్ణనములు పూలచెండులమాటలు, ఒక్కొక్కచోట, నట్టియెడ బ్రయోగించిన విశేషణములు రసమునకు సహాయమాచరింపకుండుటయేగాక, రసభంజకములుగా గూడ బరిణమించినవి. చూడుడు

"తతః ప్రియో పాత్తరసే ధరోష్ఠే
నివేశ్య దధ్మే జలజం కుమారః (రఘువంశం)

ఈ శ్లోకము రఘువునకును, నింద్రునకును బొడమిన యుద్ధఘట్టములోనిది. "ప్రియోపాత్తరసే" యను విశేషణము, శంఖమునూదుటలో నేమియు నుపకారముగాదు. పైగా సందర్భానుచితమగు రతిని పాఠకుని మది కెలయించి, ప్రస్తుతము నుపసర్జనీ భూతముగ కావించుచున్నది. లేక రఘుమహారాజు కేవలము చపలుడనిపించుచున్నది కాళిదాసులోని చపలతయే రఘువునకును సంక్రమించినది. శాకుంతలములోగూడ నొక శ్లోకమున్నది "ఇంద్రుడు పంపిన మాతలి వచ్చి, విదూషకుని సిగ బట్టుకొన్నాడు ఆగ్రహోదగ్రుడగు దుష్యంతుడాతని విడిపింపబోవుచు :

"ఏషత్వా మభినవ కంఠ శోణితార్థీ
శార్దూలః పశుమివ హన్మి వేష్టమానమ్
ఆర్తానాం భయమప నేతుమాత్తధన్వా

దుష్యంత స్తవ శరణం భవ త్విదానీమ్" అన్నాడు. ఇందులో సందర్భశుద్ధిగల బంధములేదు. వాడిన యుపమానమును వేడిగలదిగాక, కేవలము నీరసమైయున్నది. భవభూతి వీరరసమునుబరికించిన, పాఠకునకు దీని జూచిన నవ్వుదప్ప మరేమియు గల్గదు. ఇతని కావ్యముల యందు వీరరసమే చాల తక్కువ. ఒకటిరెండుచోటుల వ్రాసియున్నను బాగుగానుండదు. అట్టియెడ కేవలము వీరరస ప్రధానమగు సేతుబంధమును గాళిదాసెట్లు వ్రాసియుండును? కాళిదాసు వాడిన ప్రాకృత వచనశైలికిని, సేతుబంధకారుని ధారకును హస్తిమశకాంతరము భేదమున్నది. పదములనడపుట యందే యొక విధమగు విశిష్టత యిరువురకును గలదు. అసలు ప్రవరసేననకును, కాళిదాసునకును గల సంబంధమెంతటిదో, యెట్టిదో నాకర్థమగుటలేదు ఇంతవరకు గావించిన పరిశోధనలబట్టి చూచిన, వీరిరువురకును సంబంధమున్నట్లు గానరాదు. లేదు .... కాళిదాసులెందరో మనకు దెలియదు. నేటికిని నలుగురు దేలినారు. వారిలో నొక్కరైన వ్రాసియుండరాదా యనుమాట సర్వాబద్ధమేగాక యవిచారమూలము గూడ స్వవచన వ్యాఘాతముగూడ గలుగకపోదు. శాకుంతలాది గ్రంథములు వ్రాసిన కాళిదాసు దప్ప దక్కినవారు ప్రసిద్ధులుగారు. వారు వ్రాసిన గ్రంథములు మనకు స్పష్టముగా దెలియవు. అసలు వారుండిరో లేదో యనుమానము. ఇంత పట్టుదల దేనిని గురించి? రాజులు కవులుగా నుండగూడదనియా? బ్రాహ్మణులు కవులు గావచ్చునట శూద్రులు కావ్యములు వ్రాయవచ్చునట! మరి క్షత్రియునకు మాత్రమేమి యీ యనావృష్టి? వారు మాత్రము చదువుకొనగూడదా? కవులుగారాదా? అది ప్రపంచములో జరుగరానంత యసంభవమాయేమి? ఒకవేళ రాజు సమ్మతించినను కాళిదాసు తాను గ్రంథమును వ్రాసి యాతని పేరు పెట్టునంతటి యస్వతంత్రుడా? మహాలౌకికుడు, యుక్తిచతురుడు, నీతి నిష్ణాతయునగు కాళిదాసు దరిద్రతకుగాను

గ్రంధమును బరులకంటగట్టెననుట నమ్మదగినదేనా? కాళిదాసుడే దరిద్రుడైనచో, ప్రపంచముననింక ధనవంతుడెవ్వడుండును? అతడే, సుఖమును, ఆత్మశాంతి ననుభవింపలేదన్నచో భగవంతుడుగూడ సృష్టిలో సుఖపడలేదు అయిన రామసేతు ప్రదీపములోని శ్లోకమునకేమిగతి? ఆ శ్లోకము పరంపరాగతమగు జనశ్రుతిననుసరించి వచ్చియుండునంతే. ఆశ్వాసాంతములోని గద్యమును నమ్మదగినదిగాదు కాగా ఊరక వాదోపవాదముల బెంచుకొనుట కంటె ప్రవరసేనకృతము సేతుబంధమని నమ్ముట సముచితము అందులోనే ప్రవరసేనుడో పరిశోధకులు పరిశ్రమించి కనుగొనవలసి యున్నది

ప్రాకృత కావ్యములకు "బ్రసాద" గుణమొక పెట్టని సొమ్ము. ప్రాకృత కావ్యములలో పైకి గొంత కఠినమైనది "గౌడవహము" మాత్రమే అదియును నక్కడక్కడనే. ప్రాకృత వాఙ్మయమున చాల లలితమైనది యశోధర చరిత్రము. సేతుబంధము రెండవదిగా నిలువవచ్చును సాధారణముగా దీర్ఘ సమాసములే లేవనవచ్చును. ఒకచోట బ్రయోగించినను మన పెద్దన్న సూరన్నలవలె పలికి పలుకనట్లుండు నక్షరముల గూర్చుకొనిపోవునేగాని శ్రీనాథునివలె ప్రయత్నోచ్చారణీయ ములగు వానిని వాడడు చిన్నిచిన్ని తునకలలో గావ్యము నల్లుట ప్రవరసేనునకు జాల ప్రియమగునలవాటు జూడుడు :

దణు యెందరు హిరలగ్గే
జస్స ఫురంతే నహప్పహావిచ్ఛడ్డే
గుప్పంతీ వివలాయా
గలియవ్వ ధణంసుయే, మహాసుర లచ్ఛీ

(దనుజేంద్ర రుధిర లగ్నే, యస్యస్ఫురతి నఖప్రభావిచ్ఛర్దే, వ్యాకులా విపలాయితా, గలిత యివ స్తనాంశుకే మహాసురలక్ష్మీః)

గమియా కలంబవాయా
దిట్ఠం మేహారి ధయారియం గయణయలం
సహియో గజ్జియసద్దో
తహవి హాసేణ త్థితి జీవియే ఆసంకో

(గమితాః కలంబవాతాః, దృష్టం మేఘాంధకారితం గగనతలమ్, సోఢో గర్జిత శబ్దః, తథాపి ఖల్వస్యా నాస్తి జీవితే ఆసంగః)

సేతుబంధకారుడు చక్కని విమర్శకుడు. సందర్భమున్నను లేకున్నను ఔచిత్యమున్నను వలసపోయినను గ్రంథమును బెంచుకొనిపోవు చిల్లరకవిగాడు. వ్రాసెడు ప్రతి శ్లోకమునకును, ప్రతి పదమునకును నిగూఢమగు వ్యాఖ్యను మనసున నుంచుకొన్నట్లు గానిపించును. మహాకావ్యములకు ముఖ్యలక్షణములగు గభీరత,

కథలోని విరుగడలేనితనము, ధారాశుద్ధి ప్రతియొక చోటను ప్రత్యక్షమగుచుండును. ఒళ్లు మరచు నావేశిగాడు. మాటిమాటికిని దడవిచూచుకొను లోభిగాడు. ఛందోబద్ధమగు కవిత్వమునను న్నకష్టమెంతయో, అభినవములగు భావములు, పద్యములయందు జోడించుట యెంత ప్రయత్న సాధ్యమో గమనించి, తనయనుభవము యొక్క మహాత్మ్యముచే వాటిని సరిపెట్టుకొని నడచు మహనీయుడు.

("ఇచ్ఛాయివధణరిద్ధీ, జోవ్వణలద్ధవ్వ అహియాయీ వసిరీ,
దుఃఖం సంభావిజ్జయి, బంధచ్ఛాయీయ అహిణవా అత్థగయీ)
(ఇచ్ఛయేవ ధనబుద్ధిః యేవనలబ్ధే వాఘేజాత్యా శ్రీః
దుఃఖం సంభావ్యతే బంధచ్ఛాయయీ భినవార్థగతిః)

మహాకావ్య నిర్వహణములోని కష్టసుఖముల గురించి యితడు పలికిన పలుకు, మహాకవుల మనస్తత్వమునకద్దము వంటిది. దానితో నామహామహునకు గావ్య నిర్మాణమునందెంతటి యనుభవముగలదో, లోతుపాతుల నెంతవరకు గ్రహించినాడో మనమూహింప వచ్చును.

(అహిణవ రాయీరద్దా, చుక్కక్ఖలియేసు విహడియు పరిట్ఠవియా మేత్తివ్వపముహరసియా, ణి వ్వోఢుం హోయి దుక్కరం కవ్వకహా)

(అభినవ రాజారబ్ధా చ్యుత స్ఖలితేషు విఘటిత పరిస్థాపితా మైత్రీవ ప్రముఖ రసికా, నిర్వోఢుంభవతి దుష్కరం కావ్యకథా)

ఇతని కవిత అడ్డు, అజ్ఞలేని స్వేచ్ఛా విహారిణిగాదు. మరి నియమబద్ధమగు పతివ్రత. ఇతని జీవితమున కొక యాదర్శసమున్నది. అది కావ్యమునందును జొరబడి యాతని కవిత్వలక్షణముగ మారిపోయినది. మొదలిడిన మార్గమును నడుమ విడువక, మనసులోని "యాదర్శము" చాల లలిత గంభీరముగ నిర్వహించినవాడు ప్రవరసేనుడు. ఆతని యాదర్శమిది.

"పరివడ్ఢయి విణ్ణాణం
సంభావిజ్జయి జసో విఢప్పంతి గుణా
సువ్వాయి సుపురి సచరియం
కింతం జేణణహరంతి కవ్వాలావా
(పరివర్ధతేవిజ్ఞానం సంభావ్యతేయశః, ఆర్జ్యంతే గుణాః, శ్రూయతే సుపురుషచరితం, కింతద్యేన నహరంతి కావ్యాలాపాః)

ధ్వనికారుడు రసచర్వణమే యనైకాంతికమగు ఫలమని వ్రాసెను. భామహుడు, కావ్యాదర్శ, కావ్యప్రకాశకారులు మొత్తముపై సేతుబంధకారుని యాశయమునే యనుసరించిరి. కవితకు లౌకికాపేక్ష యున్నదా లేదా యనునది వేరు వివాదము దానినిట విచారించుటకు జోటును చాలదు, సందర్భమును లేదు. మొత్తముపై

చాలమంది యాలంకారికులు కవితకు లౌకిక ఫలమును గూడ స్వీకరించిరన్న జాలును ఈ శ్లోకమే ప్రతాపరుద్రీయము మొదలగు గ్రంథములలో గ్రంథకర్త పేరుతోగాక, ఊరకయుదహరింపబడినది.

సేతుబంధకారుని యందింకొక విచిత్ర గుణమున్నది. ఇతనివలె వస్తువును పాఠకునకు బరిచయము గావించుకవి నేనెఱిగినంతవరకు మరియొకడులేడు. సంస్కృత నాటకముల యందు సూత్రధారుని శ్లోకమునందలి ముద్రాలంకారము వంటి యొక గుణముండును అంతేగాక యట్టి శ్లోకము లచ్చు కట్టువేసిన పటములవలె మట్టసముగా సార్థకములగు విశేషణములతో గూడి యుండును. సంస్కృత కవులలో కాళిదాసు గూడ గొంతవరకీ యలవాటున నిపుణుడు. అట్టి ఘట్టముల యందు సందర్భశుద్ధిగల యా శ్లోకమును జదివిన వెంటనే, యదేమోగాని యొడలంతయు నొక్కసారి పులకరించును. మేఘదూత మందు మనకగుపించు విశిష్ట గుణములలో నిదియొకటియని నా యభిప్రాయము. సేతుబంధములోని వొక రెండు మాత్రముదహరింతును

"తంతియ సబందిమోక్షం సముత్థతెల్లోక్కహియ యసల్లుద్ధరణం
సుణహ అణురాయ ఇహ్నం సీయాదుక్ఖ క్ఖయం దహముహస్సవహం"
(తంత్రిదశ బందిమోక్షం సమస్త త్రైలోక్య హృదయ శల్యోద్ధరణం,
శ్రుణతానురాగ చిహ్నం సీతా దుఃఖ క్షయం దశముఖస్య వధమ్)
మరియొకచోట శరదాగమమును వర్ణించుచు, వెలువఱచిన భావగభీరత :
"తోహరి వయి జసవంధో
రాహవజీ యస్స పధమ హత్థాలంబో
సయా బాహ విహావో
దహముహ వజ్ఝ దివ హో ఉవగవో శరదో"
(తతో హరిపతి యశః పధో రాఘవ జీవస్య ప్రధమ హస్తాలంబః, సీతా భాష్ప విఘాతో దశముఖ వధ్యదివస ఉపాగతా శరత్)

సాధారణముగా సంస్కృత కవులకన్న ప్రాకృత కవులయందు ప్రత్యేకత యెక్కువగా నున్నను సేతుబంధకారుని యందాగుణము మరింత హెచ్చు. భావములనతడు ప్రదర్శించునపుడేదియో యొక యపూర్వ ప్రపంచమునుండి గైకొని వచ్చినట్లుండును అప్పుడు మనమొక క్షణముసేపాశ్చర్య చకితులమై కాలుసేతులు గదపక నిలచిపోదుము తరువాత తిన్నగా రసము నాస్వాదింప యత్నింతుము. అయ్యది మహాకవుల ప్రతిభలోని గొప్పతనమని నాయభిప్రాయము సేతుబంధమును జదువునపుడు రెండుమూడు శ్లోకముల కొకసారి యట్టి భావములు దొరలుచునే యుండును. మెదడు నాఘూర్ణిత మొనరించు భావములయందేగాక, సామాన్యములగు వానియందును సేతుబంధ కారుని భావ స్వతంత్రత గొప్పది రాము ఒకసారి ధనుస్సువైపు పరికించినాడు కార్య ధురమునందు భావనాదృష్టివలె, శరాసన కీలితమగు

నాచూపు ప్రకాశించెనట.

"దృష్టిః దృష్టస్వామ్ని కార్యధురేవ నిజకే ధనుషి నిషణ్ణా"

రాముని దర్శింప వచ్చిన హనుమంతుడు చింతిత సుఖోపనతమగు మనోరధమువలె నుండెనట.

"ప్రేక్షతే మారుతతనయం మనోరథమేవ చింతిత సుఖోపనతం"

ఇంతయేల? భావనా స్వతంత్రత, ప్రాకృత కవులకెల్లరకును లక్షణము. అందులోను సేతుబంధకారుడు మహాస్వతంత్రుడు అంతటి మహాగ్రంథమును నిరాఘాటముగ నడపినను, ఒక్క ముక్కయైనను ఇతరుల యెంగిలి గానము ఎక్కడ బట్టినను ప్రతిభావిష్కారమే, అసాధారణమగు మేధామహత్తే మెఱుపుదీగెలవలె మెఱయుచున్నది.

ఔచిత్యాది గుణములను బోషించుటతోపాటు రసపోషణమునను ప్రవరసేనుడ ద్వితీయుడు. అనుక్రమమున ధారను బట్టుకొనివచ్చుటలో తిక్కనకున్నంత గొప్పతనమున్నది. పదకముల వంటి విశేషణములలో మేరువంతటి భావమును బోధించుట యీతని కొకలీల. అర్ధనారీశ్వరుని వర్ణించుచు "ద్వితీయావకాశ గమనోత్సుకం వామార్ధం"

వేపతేయస్య సవ్రీడం
వలితుం మ హతి పులకాచితస్తన కలశం
ప్రేమస్వభావ విముషితం
ద్వితీయావకాశ గమనోత్సుకం వామార్ధం

అన్నాడు వామార్ధమునందలి పార్వతి ప్రేమస్వభావ విముషితయై భర్త యందైక్యమునొందుట కాకాంక్షించుచున్నది లజ్జచేత శరీరమును సంకుచించుకొనుటలో ప్రేమ విలీనయై యింతటి యింద్రజాలమును గావించినది. ఇంకను నందులో మహత్తరమగు ధ్వని పుష్టి యున్నది. పాఠకులూహింతురుగాక

పిపీలిక మొదలుకొని బ్రహ్మాండము వరకును, సకల ప్రపంచము నీతని కవితా కన్యకకొక ముక్కయై పోయినది. రాజనీతి, లోకానుభవము, సహృదయత, గభీరత, అక్షరాక్షరమునను బ్రత్యక్షమగును. అంతయును నుదహరింప వలెనన్న, గ్రంథమంతయు మరల వ్రాయవలసివచ్చును కాన యా యసాధ్య కార్యమునుండి యింతటితో విరమింతును. రస పిపాసువులగు పాఠకులు ప్రత్యేకముగా జదువుకొని యానందింతురు గాక! సూత్రప్రాయమగు మాటయేమన, ప్రవరసేనుడు కవి కులాలంకారుడు ఆత్మశక్తిగల మహర్షి, శాంతిని స్వాయిత్తీకరించుకొన్న భగవంతుడు. మహామహుడు అతని భావనాశక్తి యెదుట మనము, చీమలవలె చాల నల్పులము. భావనాశక్తిని గమనింపలేని మనయల్పజ్ఞతకు నవ్వవలయునా? యేడ్వవలయునా?

*(భారతి, జూలై 1939)*

*జైన గ్రంథమగు*

# సావయధమ్మదుహా

జైనమతమునందలి, సామాన్యధర్మములను, సరసముగ జూపి చెప్పినదీగ్రంథము. పుస్తకము చాలచిన్నదియే. విషయముగూడ సాధారణముగనందరకు బనికివచ్చునదిగాక ప్రత్యేకమైనది. అనగా జాలవరకు బారిభాషిక మన్నమాట భాషాబంధము జాల మంచిది. అలంకారములలోని నయగారము, ఛందములయందు వాని జోడించుట యందలి చమత్కారము, కవికొక ప్రత్యేకతను గల్పించినవి అన్ని విధముల మెలిదిరిగిన దాతని సిద్ధ హస్తము మలయ మారుతములు చల్లగా సున్నితముగా వీచునుషస్సులలో అల్లన విచ్చుకొనుచున్నది. పూమొగ్గలాతని యుపమానములు. భాషనుదూచి, గభీరగమనమున బరువెత్తించు శిల్పవిద్య యితనికలవాటు. పాడుకొన్న ఛందమా? చల్లని వెన్నెలలో, ఒంటిపాటున మెలికలు ద్రిప్పుకొనుచు బ్రయాణించు సెలయేరువంటిది, శరత్కాలములో మధుర మందగమనమున వరిచేల బరుగులెత్తుగోదుమ నాగువంటిది. అస్ఖలితములగు లయలతో భరతకన్యయాది చూపించు, విషమ నాట్యము వంటిది. కందములోని పరుగు, ఆర్యావృత్తములోని యందము, నాకలించుకొనినట్లున్న దోహావృత్తము. పదిపదునొకండు శతాబ్దములనాటికి దోహాఛందములోని మొదటి గ్రంథమగునేమో! ప్రాకృత కవసమును జవిజూచినవారికి, గాథావృత్తమునకన్న పదును, ధారాశుద్ధిగలదీ దోహ. ఇంత మాత్రము, జాలును దాని ప్రత్యేకతకు, గొప్పదనమునకు ధమ్మపదము, భగవద్గీతవంటి యుత్తమోత్తమ గ్రంథము గాకున్నను ఆ తెగలోని యుత్తమ గ్రంథములలో నిదియొకటి. అందుకు సందేహములేదు. కాని యీ గ్రంథము వాటివలె సంపుటీకరణముగాదు. ప్రత్యేక వ్యక్తియొక్క కలమునుండి జన్మించినదియే. ధమ్మపదము బుద్ధుడు వ్రాయలేదనియు, నంతకుముందే ప్రచారమున నున్నవాటిని వరుసగా గూర్చినారనియు నొక వాదమున్నది ఇది యట్టిది గాదంటిని అంతే.

దీని నిజమగు పేరేదో మనమెఱుగము. సామాన్యముగా జైన వాఙ్మయమున నిట్టి గ్రంథములను శ్రావకాచారములనియు లేక నుపాసకాచారములనియునందురు. ప్రాచీన సంప్రదాయముననుసరించి యీ గ్రంథము యొక్క వ్రాతప్రతులలో చూడుడు. (హీరాలాల్ జైన్‌గారి భూమిక. ఆగ్రా దిగంబర జైన మందిర ప్రతి) "శ్రావకాచార దోహక్" అనియు "ఉపాసకాచార" ("ఇతి శ్రావకాచార దోహాదా జోగేంద్ర దేవకృత సంపూర్ణం") జయపుర పాటోదీజైన మందిర ప్రతి "ఇతి ఉపాస కాచేరే ఆచార్య శ్రీలక్ష్మీచంద్ర విరచితే") అనియు నున్నది మూల గ్రంథమునందు, మొదటి దోహావృత్తములో మాత్రము "సావయధమ్మ" (ఇమ కారేపిఱు పంచగురు, దూరదలియదుహకమ్ము. సంఖే వేపయడ క్షరహి - అక్ఖమి సావయధమ్ము") యని వాడినాడు కవి. వేరొక ప్రతియందు గ్రంథాంతమునందలి శ్లోకములో "దోహాబ౹

వంయధమ్మం" అని ("ఇయ దోహాబద్ధ వయ ధమ్మం - దేవసేనై ఉవరిట్ఠ లహూయ క్ఖర మత్తా హేమో పయసయణ ఖమంతు") యున్నది. అనగా "దోహా బద్ధవ్రత ధర్మ" మని యర్థము. కాగా "సావయ ధమ్మదుహా" యనియో లేక "దోహా బద్ధ సావయధమ్మ" యనియో కవి యభిప్రాయమై యుండెనని మన మూహింపవచ్చును.

కొంతమంది జైనపండితులు, దీని భాష నర్థమాగధియని పిలచిరి కాని యది యర్థమాగధియేయని ఖచ్చితముగా చెప్పలేము శౌరసేని మొదలగు నితర ప్రాకృతములలో నిది జేరదు. అంతవరకొకరీతిగా నిర్ణయింపవచ్చును ప్రాకృతములు దేశభాషలుగా మారుటకన్న బూర్వరూపము లిందున్నవి. అనగా, ప్రాకృతములయొక్క వికసిత రూపములుగాని లేక భ్రష్టరూపములు గాని యని చెప్పవచ్చును. కాగా దీనియందలి భాష "నపభ్రంశ" మనుట సమంజసము. దీనినే వారు "అవహట్ఠ" యని పిలుతురు. సంస్కృతము యొక్క యధికారము గొంతకు గొంత తగ్గిన తరువాత ప్రాకృతములు, వాటి యపభ్రంశములు జన సాధారణములై, సంస్కృతమున కన్న మధురములని పించుకొన్నవి. విద్యాపతి ఠాకూరు మహాశయుడు దనగ్రంధమగు "కీర్తిలత" యందపభ్రంశము సంస్కృత ప్రాకృతములకన్నను నాజూకైనదన్నాడు. ("సక్కయవాణీ బహయన భావయి పా ఉయరసకో మమ్మనపావయి, దేసి లవయనా సబ్జనమిట్ఠా తైతాసనజంపవో అవహట్ఠా)

పదియవ శతాబ్ది ప్రాంతములయందు, నీయపభ్రంశభాషయే యుత్తర దేశమున విరిసి యల్లి కొనియుండినది. ప్రస్తుత గ్రంథము మాల్వదేశ ప్రాంతముల యందు రచింపబడిన దగుటచే, సామాన్యముగ, పశ్చిమదేశమునందలి యపభ్రంశము లెక్కువగ జోటు గలిగించుకొన్నవి. ఆచార్య హేమచంద్రుడు ప్రాకృతవ్యాకరణకర్తగదా! ఆతడపభ్రంశమును సోదాహరణముగ నియమించినాడు. అతని సూత్రములు, దీనికే చక్కగా ననువర్తించును తరువాతి "ణాయ కుమార చరితమునందు" గూడ మాల్వదేశీయప్రాంతమగు నపభ్రంశమే యెక్కువ. ఈ రెంటిని బోల్చి చూచిన, నీనమ్మకమింకను బాగుగ స్థిరపడగలదు.

"సావయ ధమ్మదోహ"మునకు జైన వాఙ్మయమునందు సమృద్ధమగు గౌరవముండెనని యూహించుటకు జాలనవకాశములున్నవి దీనియందలి సుందరములగు దోహావృత్తములను సమకాలికులును, దరువాతి వారును గూడ దమ గ్రంథములయందుదాహరించిరి "దోహా పాహుడ" మను గ్రంధమునందు దీనియందలి దొక దోహావృత్తమున్నది. "దోహాపాహుడ" మపభ్రంశ భాషలోని యొక కావ్యము. అది యింకనూ బ్రచురింపబడలేదట. పండిత హరిలాలుగారు ఈ దోహావృత్తము "దోహా పాహుడమున" నున్నదని తమ భూమిక యందు సెలవొసగినారు. శ్రుతసాగరుడనునతడు వేరొక జైనకవి ఇతడును గొంతవరకు బ్రసిద్ధుడే అతనిచే "షట్ ప్రాభృతటీక" రచింపబడినది. అందులో "సావయధమ్మదుహా" లోని యెనిమిది

వృత్తములుద్ధృతీకరింపబడినవి. బ్రహ్మనేమి దత్తకృతమగు "ప్రీతింకరచరితము" నందును రెండు దోహావృత్తములున్నవట. పై వాక్యములు హరిలాలుగారి భూమిక యందలివే. ఈ గ్రంథములు గొన్ని యింకనూ వెలువడలేదు. వెలువడినవియు బ్రకృతము నా సమక్షమున లేవు. కాగా, మనము మహనీయులగు హీరాలాలుగారి మార్గమునే యనుసరించుట సముచితము. ఇంకను, వెదుకవలయుననియు, నవశ్యము మరికొన్ని గ్రంధముల యందును దీనినుదహరించి యుందురనియు వారే సెలవిచ్చియున్నారు. దీనికి రెండు వ్యాఖ్యానములు గలవు. ఒకటి,- లక్ష్మీచంద్రుడు వ్రాసిన పంజిక. వేరొకటి ప్రభాచంద్రముని వ్రాసిన "తత్వదీపిక" యను వృత్తిగ్రంథము. ("పూనా: భండార్కరు రిసర్చి యిన్‌స్టిట్యూట్ ప్రతి :- మూలం యోగీంద్ర దేవస్య - లక్ష్మీచంద్రస్య పంజికా, వృత్తిః ప్రభాచంద్రమునే ర్మహతీ తత్వదీపికా") "పంజిక"కును "టీక"కును, "వృత్తి"కిని భేదమున్నది. హేమచంద్రాచార్యుడు "టీక"కును, "పంజిక"కును నీరీతి భేదము గల్పించినాడు.

"టీకా నిరంతర వ్యాఖ్య పంజికా పదభంజికా" అందులకు టీక "సుగమానాం విషమాణాంచ నిరంతర వ్యాఖ్యా యస్యాం సాటీకా" "విషమాణ్యేవ పదాని భనక్తి పదభంజికా" అనగా కఠినములగు పదములకు మాత్రము వ్యాఖ్యానము వ్రాయుట "పంజిక" యనియు సరళములగు వాటికిని, విషమ పదములకు నన్నిటికి వ్రాయు వ్యాఖ్యానము టీక యనియు నభిప్రాయము "వృత్తి"యనుదానికి బ్రాచీన పరిభాషయెందును దొరకలేదు. సరళమగు ననువాదప్రాయము వృత్తియగునేమో, అనగా నాంగ్లమునందలి (paraphrase) వంటిదన్నమాట. పూనాయందలి భండార్కరు గారి విద్యాలయమునందొక ప్రతియున్నదట. దాని ముఖపత్రముపై వారు "దోహక శ్రావకాచార్ లక్ష్మీచంద్ర కృత పంజికా సహిత్" అని వ్రాసియుంచిరట. దానిని గురించి పండిత హీరాలాల్‌గారి యభిప్రాయమిది.

"హేమచంద్రసూరి పరిభాష ననుసరించి దీనిని "పంజిక" యనుటకు వీలులేదు. దీనియందు విషమపదములకేగాక సరళములగు వాటికిని వ్యాఖ్యయున్నది. రెండుమూడు చోటుల బాగుగనే యనువదించినాడు. కాని మొత్తము పైన దన ధోరణియేగాని మూలమును సరిగా నర్థము జేసికొనడు. ఇతనికి సంస్కృత జ్ఞానము చాలదక్కువ. లింగవచనములను తిజంత, కృదంతములను గూడనితడు గమనింపడు. మూలమునందలి యమూల్యములగు నుపమానముల నెన్నిటినో, దనయనువాద ధోరణిచే జెఱచి పెట్టెను. ఇతని వృత్తి యంతయు వెదకినను, సరిగా ననువదించిన ఛందములొక పదికన్న నెక్కువలేవు. కవి హృదయమును బొత్తిగా గమనింపడు. తెలిసిన విషయమును సరిగా వెల్లడించు పాటి సంస్కృత జ్ఞానము గూడ నున్నట్లు దోపదు."

ఈ ప్రభాచంద్రముని దేశముగాని, యాతడు జీవించిన సమయముగాని మనకు స్పష్టముగా దెలియదు. ధారానగర నివాసి యొక ప్రభాచంద్రముని యున్నాడు.

అతడు "పుష్పదంతుని" కావ్యములకు టిప్పణి వ్రాసెను. పైవృత్తి గ్రంధకర్త యాతడు మాత్రము గాడు. జైన వాఙ్మయమున, "ప్రభాచంద్రులు" (చూడుడు "రత్న కరండ శ్రావికాచార్" పండిత జుగల కిశోర్ ముఖ్తార్ కృత భూమిక) చాల మందిగలరు. అయిన లక్ష్మీధర కృతమగు "పంజిక" గతించినట్లెనా? కాదు జయపూర్ నందలి "పాటోద్" జైన మందిర ప్రతిలోని వ్యాఖ్యయే లక్ష్మీచంద్ర కృతమని పండిత హరిలాల్ గారు నుడువుచున్నారు. లక్ష్మీచంద్రుడు ౧౫౫౦ ప్రాంతముల వాడని, యిప్పటివరకు గావించిన పరిశోధనలబట్టి తేలుచున్నది.

గ్రంధము రసవత్తరమైనది, ప్రసిద్ధమైనది సలక్షణమైనది కాని, యీ గ్రంధమును వ్రాసిన మహాకవి ఎవ్వరు? గ్రంథము యొక్క ఆద్యంతములయందు కవినామముగాని, కాలముగాని లేదు. అతడేయూరనుండెనో తెలిసికొను మార్గములును లేవు. వ్రాతప్రతులను బరిశీలింపగా ముగ్గురి నామములు దేలినవి -- యోగీంద్రదేవుడు, లక్ష్మీశ చంద్రుడు, దేవసేనుడు. "సావయధమ్మదోహము" యొక్క వ్రాతప్రతులలో నాలుగిటియందు లక్ష్మీచంద్రుడని గలదు. (పాటోదీ జైనమందిర ప్రతి · ఇతి ఉపాసకాచారే, ఆచార్య శ్రీలక్ష్మీచంద్ర విరచితే, దోహకసూత్రాణి సమాప్తాని. స్వస్తి సంవత్సర ౧౫౫౫ వర్షే కార్తిక శు॥ ౧౫ సోమే శ్రీమూల సంఘే, సరస్వతీ గచ్ఛే, బలాత్కార గణే అభయ విద్యా నందిభట్టే మల్లిభూషణ తచ్ఛిష్య లక్ష్మణ పఠనార్థ దోహా శ్రావకాచార"

మరిరెండు ప్రతులలో నీరీతిగ గలదు. పూనా భండార్కర్ యిన్‌స్టిట్యూట్‌లోని ప్రతి : శ్రావకాచార దోహకం లక్ష్మీచంద్ర కృతం సమాప్తం. మూలం యోగీంద్ర దేవస్య, లక్ష్మీ చంద్రస్య పంజికా, ప్రభాచంద్రమునీంద్రస్య మహతీ తత్వదీపికా మరియొక పత్రికలో ఇతి ఉపాసకాచారే ఆచార్య లక్ష్మీచంద్ర రచితే దోహక సూత్రాణి సమాప్తాని) విద్యానంది యొక్క శిష్యుడగు శ్రుతసాగరుడు దన "షట్ ప్రాభృత టీకయందు, దీనియందలి దోహదములుదాహరించుచు నడుమనడుమ 'తధాచోక్తం లక్ష్మీచంద్రేణ గురూణా" యనియు "తధాచోక్తం లక్ష్మీధరేణ భగవతా" యనియు నన్నాడు ఆ లక్ష్మీధరుడు, నీ లక్ష్మీచంద్రుండు నొక్కరని యూహింపవలసియున్నది

"షట్ ప్రాభృతటీ" యందలి శ్రుత సాగరుడు దాను వ్రాసికొన్న స్వవిషయమునుబట్టి చూడ, వీరిరువురును సమకాలికులని తోచుచున్నది. బహుశః లక్ష్మీచంద్రుండు గురుపీఠము వాడగుటచే నతని యందలి గౌరవమువలన నుదాహరించెనేమో వారి గురుపరంపర యిది : యోగీంద్రుడు మల్లిభూషణుడు, లక్ష్మీశచంద్రుడు అని. కాని పూనాలోని వ్రాతప్రతుల యందిందుకు విరుద్ధముగానున్నది. దానినిబట్టిచూడ మూలకారుడు యోగీంద్రదేవుడనియు పంజికాకారుడు లక్ష్మీశచంద్రుడనియు, వృత్తికారుడు ప్రభాచంద్రమునియనియు దేలుచున్నది. దీనికిదోడు జయపూరు నందలి ప్రతియందు "మల్లిభూషణ తచ్ఛిష్యపం॥ లక్ష్మణ పఠనార్థ దోహశ్రావకాచార్" అనిగలదు. కాగా మూలమును విద్యానంది పట్టభద్రుడగు మల్లి

భూషణుండు వ్రాసెననియు, నది తన శిష్యుడగు లక్ష్మణుని పఠనార్థము వ్రాయబడెననియు దెలియుచున్నది లక్ష్మణచంద్రుడు గురుపీఠము నెక్కుటకు ముందు లక్ష్మణుడనుపేర నుండి యుండవచ్చును. పై జయపుర ప్రతిలోని "లక్ష్మణ చంద్ర విరచితే" యను పదము పొరపాటు "లక్ష్మణ చంద్ర లిఖితే" యని యుండవలసి యుండెను. దీనికి దరువాతి వ్రాయస గాండ్రా తప్పుడు పాఠమును జూచి మోసపోయి యుందురు. వాస్తవమునకు "లక్ష్మణచంద్రుడు, ప్రాకృతమునందుగాని, సంస్కృతమునందుగాని, దేనిని వ్రాసినట్లు గానరాదు.

ఇక రెండవ వాదము యోగీంద్ర దేవుడు వ్రాసెనన్నది భండార్కరు విద్యాలయమునందలి ప్రతిలో మూలకారుడు యోగీంద్ర దేవుడనియే యున్నది. (మూలం యోగీంద్ర దేవస్య లక్ష్మీచంద్రస్య పంజికా, వృత్తిః ప్రభాచంద్రమునేర్మహతీ తత్వదీపికా") జైన వాఙ్మయమునందు, యోగీంద్ర దేవుని గ్రంథము లిప్పటికి నాలుగు మాత్రము గానబడినవి ("పరమాత్మ ప్రకాశము, యోగసారము, అమృతాశీతి, నిజాత్మాష్టకము) మొదటి రెండును బ్రస్తుత కావ్యము వలెనే దోహబద్ధములు. మూడవది ప్రాకృతము యోగీంద్రదేవుని పరమాత్మ ప్రకాశములోని వృత్తములకు ప్రస్తుత గ్రంథములోని కొన్ని దోహలకు గొంతవరకు సామ్యము లేకపోలేదు కాని యవి గతానుగతికముగా వచ్చినవే. అనగా, ప్రతియొకనికి దెలిసిన యాచారములు కొన్ని దానియందును, దీనియందును నున్నవి. ఈ స్వల్ప సామ్యముచేతనే యోగీంద్రుడే దీనికర్తయని నిరూపింపలేము భాషా విషయమున, నక్కడక్కడ గనపడు నలతియలతి పోలికలు, వాడుకచే వచ్చియుండునేగాని వేరుగాదు. పైగా యోగీంద్రుడు, సార్థక నామధేయుడు. ఆతనికి ప్రకృతియంతయు నాత్మమయమే ఆధ్యాత్మిక దృష్టితో నిండి తొణుకునవాతని గ్రంధములు గురువు, శాస్త్రము యీ రెంటికందరాని దాతని జ్ఞానదృష్టి చూడుడు

దే ఉలు దే ఉవిసత్థు గురుతిత్థువివే ఉవికవ్వ,
వత్థుజు దీసయి కుసుమియవు ఇంధణుహో సయిసవ్వ.
(పరమాత్మ ప్రకాశము)

కాసు సమాహికర ఉకో అంచ ఉ ఛోపు
అఛోపు కరివికో వంచ ఉ,
హలసహ కలహికేణ సమ్మాణ ఉ
జహిజహిజోవ ఉతహి అప్పణా ఉ (యోగసారము)

అట్టివాడు దాన, పూజా, ఉపవాసాది మహత్వ ప్రతిపాదికమగు దీనిని వ్రాసియుండుననుట పొసగదు. గృహస్థాశ్రమములో నున్నపుడు వ్రాసియుండుననుటకు వీలులేదు పరమాత్మ ప్రకాశమువంటి మహత్తర గ్రంథమును సృష్టించు కవికలమును నిందులేదు. భాషాదృష్టితో జూచిన, నిదియాతని గ్రంథములకన్న గొంచెము పెళుసు.

కాగా యోగీంద్రదేవుడే, దీనిని వ్రాసియుండుననుటకు ప్రబలాధారములేమియు గానము

కారంజపి గ్రంథమాల యందలి, వ్రాతప్రతి యందు "దేవసేనై ఉవదిట్ఠ" యని యున్నది. అనగా "దేవసేనేనోపదిష్టం" అని యర్థము. దిగంబర జైనకవులయందు దేవసేనుడు మహాప్రసిద్ధుడు. దర్శనసారము, ఆరాధనసారము, తత్వసారము, నయచక్రము, ఆలాపపద్ధతి, భావసంగ్రహము అనునీగ్రంథములాతనివి. దర్శనసారమొకటి దప్ప దక్కినయన్ని గ్రంథములును బ్రచురితములైనవి. భావ సంగ్రహమునకు సావయధమ్మదోహకు భావసాదృశ్యములు చాల వరకున్నవి. కొన్నిటి నీక్రిందజూపుదును

మజ్జమంసుమహు పరిహరహి
కరిపంచుంబరదూరి (సావయధమ్మ)

(మద్యమును, మాంసమును, మధువును దూరము చేయము. పంచోదుంబరముల వదలుము.)

మహు మజ్జమంస ఏరయీ ఛాఓపుణ ఉంబరాణ పంచహ్ణం (భావసంగ్రహ)
(౨) తం అపత్తు ఆగామి భణిఉ
ణయవయదం సణుజాసు
ణిప్ఫల దిణ్ణ ఉహోయితాసు
జహ ఊసరిక హుసాసు

(దర్శనము వ్రతము లేని వాడపాత్రుడని యాగమములన్నవి వాని కొసగిన దానమూసరక్షేత్రమువలె వ్యర్థము )

ఊసర భిత్తే బీయం సుక్ఖే రుక్ఖేయ
ణీ రయహిసే ఓ
జహ తహ దాణమవత్తే
దిణ్ణం ఖుణి రత్థయం హోయి
(భావసంగ్రహ)

(3) ఇక్కువి తారయి భవజలహి
బహు దాయారసు పత్తు
సువరోహణు ఎక్కువి బహోయ
దీసయి పార హుణింతు.

సుపాత్రుడొక్కడే, యనేకులు దాతలను భవజలధినుండి తరింపజేయును. మంచినావ యొక్కటే చాలమందిని గట్టు చేర్చుచున్నది)

జహణా వాణిచ్ఛిద్దా
తారయి పారావారే

యుండడు. అప్పుడు సప్తశతియే యుండదు. గోవర్ధనాచార్యుడొక్కడే సప్తశతిని వ్రాయలేదా యని మీరడుగవచ్చును. కాని గోవర్ధనుని కలము పోటులకును, ప్రాకృతకవుల లలిత కుంచికలకును నెంతయో బేధము కలదు.

ఆచార్య గోవర్ధనుని సప్తశతి శృంగారపు సీమల నంటనే లేదు. కాని ప్రాకృతములోని ప్రతి గాథయు శృంగార సముద్రములోని కడపటి యంచులో నోత ప్రోతముగ మునిగితేలినది. కనుక దానితో దీనిని పోల్చి చూడరాదు అది యట్లుండె.

ఇంతేకాక గాథాసప్తశతిని చదివినపుడు అందులో వివిధ హస్తములు స్పష్టముగా కనిపించుచున్నవి. ప్రతి ముక్తకమునందును పరస్పరము భావములో, భాషలో నెన్నియో సూక్ష్మసూక్ష్మతర బేధములున్నవి. వివిధములగు మనస్తత్వములు, రుచిబేధములు దీర్ఘముగా మెడలు సాచినవి. అట్టియెడ నివి యన్నియు పెద్ద విపరీత వాదమే!

హాలుడు రాజు. ఒకవేళ నాతడెంత సహృదయుడైనను. ప్రజా రంజకుడైనను సప్తశతిలో చెప్పినంత గంభీరముగ గ్రామ్యజనుల జీవితము నర్ధము చేసికొని యుండడు. అతనికేగాదు, ఎవ్వనికైనను నట్టి దసంభవమే. కాగా, మధురమధురమగు పల్లీ జీవితమును, మధురాతి మధురములగు వారి భావములును ఏనాడును ఆ సుఖమే యెరుగని ఎరిగినను నంత గాఢముగా పట్టుపడని హాలున, కంటగట్టుట కంటెను ఒకరాజు సహృదయత గల కవి యితరుల రచనలకు ముగ్ధుడై వాని నన్నిటిని బోగొట్టక సేకరించినాడనుటలో శాతవాహనునకును, మనకును గౌరవమేకాని యమర్యాద లేదు. గాథాసప్తశతిలో రాజవర్ణనలున్నవి. హాలునివంటి చక్రవర్తి అభిమాన ధనుడు ఇతర రాజుల నెందుకు వర్ణించును? ఒకవేళ తన్నే తాను వర్ణించుకొని గ్రంథమున చేర్చి యుండగూడదా యని యందురేమో? నిజముగా నా తలపు హాలభూపతికే మనము చేయు మహాద్రోహమగును. శాతవాహనుని వంటి రసికుడాపని చేసెననుట కంటె ఆంధ్రులకు మఱియొక యవమానములేదు. కనుక నర్థములేని యభినివేశముతో లేనిపోని విపరీత సృష్టి చేసి హాలుడు సప్తశతీ రచయిత యని సాధించుటకంటెను 'సంగ్రహకర్త' యనుటయే న్యాయము, మనకు మర్యాద కూడ.

హాలుడీ గాథలను సంగ్రహింపనే లేదనియు, గుణాఢ్యుడో మఱియెవరో కూర్చి ధనాశచే నితని పేరుంచి యుందురనియు భట్టశ్రీ మథురానాథశాస్త్రిగారి మఱియొక వాదము. అసలు మన పరిశోధకులకు రాజులపై నేదో యొక వింత కంటగింపు. వారు శుద్ధ సోమరిపోతులని వీరి నమ్మకము. తిరుమల నాయని గీత గోవింద వ్యాఖ్యకును, కృష్ణరాయల యాముక్త మాల్యదకును, వేమాధీశుని యమరుక వ్యాఖ్యానమునకును గూడ నీ యన్యాయము జరిగినది. భట్టశ్రీ మథురానాథశాస్త్రిగారే తమ పీఠికలో మఱియొకచోట హాలుడు కవి యనియు, మధుర కవి యనియు పొగడిరి. ("రాత్రిందివం కవిగోష్ఠీ పటిష్ఠ స్తన్మీమాంసాభి నివిష్టతయా, తత్పరినిష్ఠమతిః సోయం స్వయమపి కవయతిస్మ, సుమధురంచ కవయతిస్మ" (గాథాసప్తశతీ పీఠిక))

దేహవిదారణేక్కవర వీరం
తందేవసేన దేవం ణయ చక్కయరం గురుంణమహ
దవ్వసహోవ పయాసం దోహయ
బంధేణ అసి జందిట్ఠం
గాహో బంధేణ పుణోరయియం
మా హల్ల దేవేణ
దుసమా రణీణ సోయప్పేరియ సంతం జహతిరంణట్ఠం
సిరి దేవ సేణముణిణా తహణయ చక్కం పుణోరయియం

అనగా దేవసేనుడు మొదలొక నయచక్రమును గూర్చియుండగా శుభంకరుడను పండితుడు దానిని విని తర్క కర్కశమగు నీవిషయము దోహా వృత్తములలో బాగుగ నుండదనియు, దానిని గాథా నిబద్ధము గావించుమనియు 'ననెనట. అనంతరము దేవసేన శిష్యుడగు మహల్లదేవుడు దానిని గాథా బంధములలో వ్రాసెనని యర్థము. దేవసేనునికి ముందొక "నయచక్ర" ముండెననియు, నది స్థలితముగాగా దేవసేనుడు దీనిని వ్రాసెననియ నాలుగవ శ్లోక తాత్పర్యము. దేవసేనుడు చాల గ్రంథముల పునరుద్ధరించినాడు. "దర్శనసారమున" పూర్వగాథలను సంపాదించియే, తానీ గ్రంథమును వ్రాసితినని స్పష్టముగా జెప్పియున్నాడు. అది యట్లుండె.

కాగా పై శ్లోకములననుసరించి తేలిన విషయములివి. "ఆనాటికి దోహా ఛందము నూతనము. అందులకుగాను పూర్వాచారపరాయణతా పటిష్ఠులగు ప్రాచీన పండితులు దాని నెరవుగా జూచుచుండిరి. దేవసేనునకు దోహావృత్తములపైరుచి, చాపల్యామెక్కువ. అందువలన బాండిత్య పూర్ణమగు "నయచక్రము" మార్చబడినను సాధారణ గృహస్థ ధర్మముల మాత్రము వివరించు "సావయధమ్మ" యధారీతిగనే యున్నది.

దేవసేనుని కాలవిషయమున నంతగా కష్టములేదు. దర్శనసారము నందాతడే స్పష్టముగా దానాగ్రంథమును, ధారానగరమునందలి పార్శ్వనాధమందు గూర్చొని వ్రాసితినని చెప్పియున్నాడు

ఆ శ్లోకములివి :
పువ్వా యరియక యాయింగాహోయిం సంచి ఊణ ఏయత్థ
సిరిదేవ సేణ గణిణా ధారామే సవ్వ సంతేణ
రయియో దంసణ సారోహారో భవ్వాణ ణవస మేణవయే
సిరి పాసణాహ గేహే సువిసుద్దే మహాసుద్ధ దసమీయే.

మాలవ ప్రాంతములయందు నాటికి, నేటికి విక్రమార్కశకమే ప్రచారములో నున్నది దర్శనసారమునందును కంఠోక్తిగ "విక్కమకాల స్సమరణ పత్తస" యని

కవియే యన్నాడు.

తాను విక్రమార్క శకము, ౯౯౦ మాఘశుద్ధ దశమినాడు గ్రంథమును ముగించితినని వ్రాసియున్నాడు.

ధారానగరమానాడు పండితులకు బండిత సన్మానములకు జాల ప్రసిద్ధము. ప్రాకృతములగూడ పఠన, పాఠనములు సాగుచుండినవి. ప్రాకృతములకు ప్రాచీనతమమగు కోశము "పాయియనామమాల" నిందే ధనపాలుడు గూర్చెను. పుష్పదంత కావ్య టీకాకర్త ప్రభాచంద్రముని యీ నగరమువాడే (చూ. నాగకుమారచరిత భూమిక) కనుక దేవసేనుడు ధారానగరమునందుండె నాయని మనము సంశయింప నక్కరలేదు. ఇంతవరకు దేలిన యాధారములబట్టి చూచినను "సావయధమ్మ" కర్త "ధర్మసేనుడే"యని స్పష్టముగా దేలుచున్నది. "సావయధమ్మ"లోని కవితావిశేషముల గురించియు, దక్కిన యితర కావ్యగుణముల గురించియు మరొకమారు దర్కించుట యుచితము.

*(భారతి, జూలై 1939)*

# జసహర చరివు
## (యశోధర చరిత్ర)

ఏ మతముగాని ఎక్కువ వ్యాప్తికి రావలెనన్నచో సాధారణముగా దాని వాఙ్మయమంతయు సామాన్యభాషలో నుండవలెననుటకొక రహస్యము. దీనిని గమనించినవి యారంభించినవి ముఖ్యముగా జైన, బౌద్ధములు రెండు. తరువాత దక్షిణమున కొంతకొంత వీరశైవము. బుద్ధభగవానుడు తన ధర్మములను బోధించి నది పాళీ భాషలోనే ఈ దృష్టి జైనులకు మరియునెక్కువ. వారానాటి ప్రచలిత భాషలన్నిటియందును జేయివేసిరి. అద్భుతముగా నిర్వహించిరి. జైనము దక్షిణా పథమునకు దిగుకొలదియు ద్రావిడ భాషలోగూడ వారి రచనలు బయలుదేరినవి. కాగా నేడు ప్రాకృతములను జదువ వలెనన్నచో జైనకవులను మరచుటకు వీలులేదు. వారి వాఙ్మయములోని చాల భాగము కాలగతికి లోబడి నశించిన మాట వాస్తవము. కాని మిగిలిన యా కొలదిని జూ సినపుడే "యయ్యో! గతించిన వాఙ్మయ మింకెంత మధురమైనదో" యను దుఃఖము గలుగును. జైన మహాకవియగు పుష్పదంతాచార్యునకీ గతియే పట్టినది. అతని గ్రంథము లెన్నియో నడుమంత్రములనే నశించినవి. నేదో మిగిలినవి మూడు మాత్రమే. అవియునూ అపభ్రంశ భాషలోనేయున్నవి. వానిలో "జసహరచరివు" (యశోధర చరిత్ర) కవితలో మధురము.

"ముగ్గే శ్రీమద నింద్య ఖండసుకవే
ర్బంధుర్గుణై రున్నతః"

రచనలో విలక్షణము, మార్గమున నూతనము. పుష్పదంతుని కాలము క్రీ శ ౧౦వ శతాబ్దములోని యుత్తర భాగము. అతడు తొలుత శైవ బ్రాహ్మణుడు. కాశ్యపగోత్రుడు. తండ్రి కేశవభట్టు, తల్లి ముగ్ధాదేవి. పుష్పదంతునకే "ఖండు"డను నామాంతరముండెను. నాడు "మన్యఖేటము" రాష్ట్ర కూటములకు ముఖ్య పట్టణము. మూడవ కృష్ణరాయడు రాజు. అతని మంత్రి భరతుడు.

"స్వప్నే ప్యేష పరాంగనాం నభరతః
శౌచాం బుధిర్వాంఛతి" (మహాపురాణము)

పుష్పదంతుడారాజు, నీ మంత్రిని గనిపెట్టుకొని యుండి, వారియాదరమున దానీ రచనములను సాగించెను.

ఆ కాలమున బుష్పదంతుడు మహాప్రసిద్ధుడు. అతనికి సుమారొక పది పదునేడు బిరుదులుండినవి. అన్నిటికన్నను "అభిమానమేరు"వను

"జయి అభిమాణ మేరుణామంకే" (మహాపురాణము)

"అహిమాణ మేరు కయి పుష్పయంతు" (జహసహచరివు)

బిరుదముపై ఆదరమెక్కువ. సమయము వచ్చినపుడంతయు దానిని సగర్వముగా దడపుకొనుచుండును. అతని జీవితమున నభిమానమొక ముఖ్యగుణము కనుకనే తనకు సరియగు గౌరవ మొసగని వీరరాజకవి పత్ని విడచి రాష్ట్రకూటుల నాశ్రయించెను జీవితములోని ఈ భావమే కవితకెక్కినది. రచనలో నాతడు మహావశి.

"జహసహచరివు" అనగా యశోధరుడను రాజు జైనుడుగా మారినగాధ. దీనికి జైనవాఙ్మయమునగల వ్యాప్తి చాలపెద్దది అందుచే భరతుని సుతుడు నన్నయ పుష్పదంతునారచనకు బ్రేరేచెను. అపుడు మహాకవికి "ప్రౌఢనిర్భరవయః పరిపాకము" అనుభవములతో బాటభిప్రాయములును సానలు దీరినవి. అన్ని విషయములందును నదుపులేని యాతని కలమద్భుత నాట్యమును గావించినది. "జసహరచరివు" అమృత భవనముగ మనకు దక్కినది.

యశోధర చరిత మొక చక్కని గేయకావ్యమనవచ్చును. ఆ గేయముల కపభ్రంశమున "కదావకము"లని పేరు అవిగాక కొన్ని గీతములవంటివే యగు "దువయీ" వృత్తములను అక్కడక్కడ "ఘత్తా" ఛందములును నున్నవి. ఈ "ఘత్తా" ఛందములు గీర్వాణమునందలి యార్యావృత్తములవంటివి. ఈ కావ్యమంత యునొక పాటవలె చల్లని వెన్నెల్లలో హాయిగా బాడుకొనుటకనుకూలముగా నుండును

పుష్పదంతుడు సమయానుకూల రచన యందు జాల గడుసరి విషయమునకు దగినట్లు శైలినేగాక ఛందములను గూడ మార్చుచుండును. ఆ విషయమును, ఆ లయము, బెనవైచికొన్నపుడెంతో మధురముగానుండును. ఈ క్రింది "కథావక" మన యశోధరామృత మతుల దాంపత్య సుఖమెంత చక్కగా అదికినదో చూడుడు

"అమయమ యీాయే సచ్ఛమయీాయే
హంసగ యీాయే సుద్దసయీాయే
పియపత్తియే మజ్ఝంతీయే
సిఢిలవిలాసో గరు అపవాసో
ణయణణివి మేసో విరహకిలేసో" (౨ - ౧)
"అమృత మత్యాసత్య మత్యా
హంస గత్యా శుద్ధ సత్యా
ప్రియపత్న్యా మంజ్ఞంత్యా
శిథిల విలాసః గురుప్రవాసః
నయననిమేషః విరహక్లేశః
యత్రచూత కుసుమ మంజర్యః
శుక చంచూపుట జర్జరితాః

వాతాందోళన లీలాసారః
తరు శాఖా సున్యత్యతి మయూరః
శోభతౌ భ్రమత్పిఛచ స హాసః
నను వనలక్ష్మి చమర విలాసః
ఖర కంటక నఖనిర్భిన్నాంగః
నచలతి యత్ర క్షణమపి భుజంగః
"ననుసవిషసర్పో దష్టుంచలతి"
"నను తుషార హారావళీ చ్ఛాదితం"

ఇట్టి రచనలను బట్టి జైనకవులు సామాన్య మానవుల హృదయములలోనికెంతగా జొచ్చుకొనిపోయిరో యూహింపవచ్చును. అట్లే యశోధరుని యుద్యానవనమును వర్ణించుచు

"జత్థచూయ కుసుమ మంజరియా
సుయిచంచూ చుంబణ జజ్జరియా
వాయం దోయణ లీలాసారో
తరుసాహాయే హల్లఝ్ఝమోరో
సోహయి ఘోలిర ఫించసహా సో
ణం వణలచ్ఛీ చమరవిలాసో.
ఖరకంటయ ణహాణి బ్భిణ్ణంగో
ణచలయి జత్థ ఖణంపి భుయంగో

అని రచన సాగినపుడెక్కడో పున్నమనాటి వెన్నెల పొరలపై పలికిన గాలిపాటవలె మనోహరముగా నినదించును సామాన్య జీవితమునకు సంబంధించిన ప్రాకృతములు నశించుటతో బాటట్టి మనోహర కావ్యములును మాయమైనవి. వానితోగూడ మధుర కోమలములగు నీసంప్రదాయములును నంతమొందినవి.

పుష్పదంతునిలో గానబడు మహాశ్చర్యకరమగు గుణము సంకుచీకరణము (Brevity) అల్పశబ్దముల ననల్పార్థ రచన గల్పించుటయాకవి కిష్టమైనది. ఒక్క పదము వ్యర్థముగ వాడకుండు టటుండగా, నొక వాక్యమే సుమారొక ఘట్టమునకంతకు దీప్తినిచ్చును.

అమృతమతి పండుకొన్నది. యశోధరుడు ప్రవేశించినాడు

"సర్వాంగపులకకంచుకితుడై" అపుడు "ణంసవి ససప్ప దట్ఠ ఉచలయి" యని వర్ణించినాడు ఆ యుపమాన మొకటే పైని జరుగబోవు దుష్పరిణామమున కంతకును వెలుగు జల్లుచున్నది. అట్లే చంద్రికా దీపితమగు రాజభవనమును "ణంతు సార హారావళి చయియం" యనుటెంతో మధురముగానున్నది.

ఈ క్రింది వర్ణనమును జూచినచో నాతని సంకోచశక్తి యెట్టిదో తేటపడగలదు ఒకనాటి చంద్రుడు

"ణం చక్కతమోహ విహండణఉ
ణం సురకరి సియ ముహ మండణఉ
ణం కిత్తియే దావియణియయముహో
ణం అమయభవణు జణదిణ్ణసుహో
ణం జస పుంజివు పరమేసరహో
ణం పండుర ఛత్తు సురేసరహో
ణం రయణీవహు హిణిదౌలతిలఉ
ఉగ్గఉ ససిణం సయిర్షిణి విలఉ"
["నను చక్రతమేఘ విఖండనం
ననుసుర కరిసిత ముఖమండనం
నను కీర్త్యాః దర్శిత నిజకముఖం
నన్వమృత భవనం జనదత్తసుఖం
నను యశః పుంజః పరమేశ్వరస్య
నను పాండురఛత్రం సురేశ్వరస్య
ననురజనీవధ్వా నిటాల తిలకః
ఉదిత శ్శశీ ననుస్వైరిణీ విలాపః]

ఇట్లున్నాడు. పై గేయమున నేపాదమునకా పాదము సుందరముగా దునిగినది. ఉత్ప్రేక్ష, ఉపమానము లనిపించునంత సరసములుగా నున్నవి. సౌందర్య పిపాసలో, స్వాతంత్రములో కాళిదాసు జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఈ సంకోచము ఈ మహాకవికి జీవధర్మము.

భావ స్వాతంత్రము ప్రాకృత కవులకే ముఖ్యముగా నంటివచ్చిన విద్య. గీర్వాణ సాహిత్యముతో, నాసాంకేతికములతో నలవాటు పడిన మనకు ప్రాకృత భాషా ప్రగతియే యొక క్రొత్త ప్రపంచముగా గానుపించును. వారి వస్తువులే వేరు. వారు దిద్దు రంగులేవేరు పుష్పదంతునియందును ఆ సంప్రదాయమే నిండుకొన్నది. తీర్థంకరునుద్దేశించి "జయణేమి ధమ్మరహ చక్కణేమి" "జయనేమి ధర్మరథచక్రనేమి" యన్నాడు. చంద్రు "నమృత భవనము"గా వర్ణించినాడు ఇట్టి వెన్నియోగలవు. ఆమూలాగ్రము భావస్వాతంత్ర్యమే చిందులు ద్రొక్కు గ్రంధమున నొకటి రెండు ముక్కలు మాత్రమే నుదాహరించుట హాస్యాస్పదము గాదా!

"యశోధరచరిత"లో గనపడు నింకొక మహత్తర గుణము మితి సామాన్య కవులకు స్వప్రతిభను వెల్లడింపవలెనను చాపల్యము మెండు. ఆయాశననణచుకొన జాలువాడు మహాకవియొకడే అనేక గ్రంథములను జూచినపుడు వానితెగ బారెడు

వర్ణనములకు ఘనము విసుగును, అసహ్యమును కలుగుచుండును. పుష్పదంతుడు మహాకవి. అతనికి చాపల్యములేదు. దేనిని వర్ణించినను పది పదునైదు పం్క్తులకు మించిపోవదు. ఆకాసంతయు నమృత ఖండమువలె ముగ్ధ మధురము సందర్భశుద్ధితో "సెలవివారో" నవ్వుచుండును. నిజముగా వేరొక కవియైనచో ద్వితీయాశ్వాసములోని సంధ్యావందనమునకు పదివృత్తములనైనను ఖర్చుబెట్టియుండును.

అలంకారములలో స్వభావోక్తి మణిదీపము వంటిది. దానిని వర్ణించుట కాకాశమున జెంగించు భావన మాత్రమే చాలదు. అనుభవము, సహృదయత మొదలగు నన్ని గుణములును బరిణతి కావలెను. ప్రాచీనులందుకే దానికసాధారణ గౌరవము నొసగి మన్నించిరి. తనయన్నిచాపల్యములను భస్మము గావించిన మహాపురుషుడే స్వభావమును జెప్పగలడు. పుష్పదంతునకు స్వభావోక్తియన్న బ్రాణము. అతని వస్తువులన్నియు సర్వ సామాన్యములు. మనకనుభవములో నుండి లెక్క పెట్టక విడచిన సజీవ చిత్రములు ఎన్నడును మరపునకు రానివి. యశోధర చరితములోని "చండమారి" వర్ణనమును చూడుడు :

"ఉరయలి విలులియణరరుండమాల
సిసుసని సమ, ముహదాఢాకరాల
ఫణి బద్ధ దీహలంబి రథణాల
తయి యచ్చి విణిగ్గయ జలణజాల
లలలాయి యజీహరు హిరోలమాల
వసకద్దమ చచ్చక్కి యకపోల
ఘోణస, కడి సుత్త యి లి హియ పాయ
పి ఉవణ ధూలీ ధూసరియ కాయ
ణమ్మంస భీమచ మ్మట్టిసేసా
సిహిసి హసం ణిహ పరిసుద్ధకేస"

పైదానిలోని భీభత్సరసము తీడిరించినది. చండమారియే యెదుటనిలచి మాటలాడినట్లున్నది. భయమగుచున్నది. ఉపమానములు రెండును దమయింత నదుకుకొన్నవి. ప్రకృతోపస్కారములై జాజ్వల్య మానములుగానున్నవి. రసవత్కవికి జీవధర్మమగు తన్మయీభవనమొక పెద్ద ప్రవాహమువలె వర్ణనము నంతయు ముంచుకొన్నది. ఇట్టిదే మరియొక స్మశానవర్ణనము.

సివసి యాలదారి యమయాయిరం
కరయరంతకాయి ఉలసంకులం
ధం ఖరు క్ష సుక్ఖహిణిప్పలం
రక్షసీ ముహో ముక్కణీ సణం
సూల భిణ్ణ చోర ఉలభీసణం

పక్షి పక్ష లక్షిహి చాయియం
కిల కిలంత ణి సియర ణిణాయియం
భీయరం చియాచిచ్చి జాలయం
ధూమగంధ దావంత సాణయం
భగ్గ బాణ విక్షిత్త ఖప్పరం

"ఇట్లు పవన (ప్రేరణోల్లలతఖస్మ" మగు దృశ్యమును కండ్లయెదుట నిలిపినపుడే పాటకుడు చలింపడు! ఇట్టి సర్వాంగ సంకలితమగు స్వభావవర్ణనయే తెనుగున నాచనసోముని యందపుడపుడు ప్రత్యక్షమై మనల నాశ్చర్యచకితుల గావించుచుండును. తాను వర్ణించు దృశ్యమును సర్వాంగ సుందరముగా భావించు శక్తియు దానిని పాఠకులకటులే యందివ్వవలెనను నానయు పుష్పదంతుని యందు ప్రధాన గుణములు.

లలలలజ్జి హ్వారుధిరార్ద్రార్ద్రా
వసాకర్దమ చర్చిత కపోల
గోనస (సర్పవిశేషః) కటిసూత్రలీఢపాదా
పితృవనధూళీ ధూసరితకాయా
నిర్మాంస భీమచర్మాస్థిశేషా
శిఖి శిఖాసన్నిభ పరిశుద్ధకేశా
సిత సృగాలదారిత మృగోదరం
కరకర, త్కాక కులసంకులం
శుష్కవృక్షాః శుష్యంతి నిష్ఫలం
రాక్షసీ ముఖాముక్త నిస్వనం

శూల భిన్నచోర కులభీషణం
పక్షిపక్షాః లక్ష్యంతే ఛాదితాః

కిలకిలన్నిశి చరనినాదం
భీకరం చితాగ్నిజాలకం
ధూమ గంధ ధావ చ్ఛ్వానం
భగ్న భాజన, విక్షిప్త కర్పరం (౨ - ౧౪)

పుష్పదంతుడు మహాసౌందర్యోపాసి. ప్రతి వస్తువునందును రామణీయకతను జూచి యారాధింపవలెనని యాతని యాశ. దానికి దగిన నిశితమగు పరీక్షణా దృష్టి నలవరచుకొన్నాడు. పైరుపచ్చలన్నను పల్లె జీవితమన్నను ఆ "మహాకవి"కి ప్రాణము. అతడు వర్ణించిన "యేధేయిక" దేశమున బంగారు మేడలు రతనాల వాడలు లేవు. మరి మహీకామిని యౌవనమును బోలిన యుపవనములు. వాని ఫలములను రాలగొట్టు క్రీడా పరవశులగు ముగ్ధ గోపాలురు. రోమంథన చలిత గండములగు నాబోతులు.

జీవితములలో మోసమేయను మాటెరుగని యమాయకులగు జనులు. యశోధర చరితమున కవితా కన్య గోపసుందరివలె ముగ్ధ మధురముగా నటించినది. నదీసుందరి వలెనమాయకముగ కుచ్చెళ్ళు జార్చినది

అపభ్రంశము మధురము. పుష్పదంతుని రచన మధురతరము.

"పుష్పయంతుడు" మహాకవి అపభ్రంశము ముఖ్యముగా ప్రాకృతములు ప్రచలిత భాషలుగావను నేరమున మనమారచనలను వదలరాదు. వదలుట ఖండితముగా మన దౌర్భాగ్యమే. నూతనమగు "జాగృతి" వెలిగిన వెలుగుచున్న ఈ కాలమున మనమనుసరింప దగిన యెన్ని గుణములో ప్రాకృతవనముల యందున్నవి. ఇది నిస్సంశయము.

కాన నికమీదనైనను మనమా "విస్మృత కవుల" నాదరింపవలెనని నా విన్నపము. ప్రసిద్ధులగు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి వంటి "గేయకవు"లెవరైనను "యశోధర చరితమును" జక్కగ దెనుగులోని కనువదింపవలెను. అట్టి యత్నములు త్వరలో జరుగునని యాశించుచున్నాను.

*(భారతి, జూలై 1942)*

# కొన్ని సప్తశతులు

ఆలంకారికాగ్రగణ్యుడు ఆనందవర్ధనుడు కావ్యభేదములను వివరించుచు ముక్తకములని కొన్నిటిని వింగడించెను. ("తత్ర ముక్తకేషు రసబంధాభినివేశనః కవేః తదాశ్రయ మౌచిత్యం" (ఆలోకము)) లోచనకారుడు పరస్పరనిరపేక్షములై రసాభిముఖములగునవే ముక్తకములని మూలకారుని యభిప్రాయమును విశదీకరించెను. ("పరస్పర నిరపేక్షేణాపిహి యేన రసచర్వణా క్రియతే తదేవ ముక్తకమ్" (లోచనము)) సప్తశతీ గ్రంథములు గూడ ముక్తక సంగ్రహములే

ఈ ముక్తకములు సంస్కృతమునగాని, ప్రాకృతాపభ్రంశములలోగాని యుండవచ్చునని యానందవర్ధనుడే నియమించెను. ("ముక్తకం సంస్కృత ప్రాకృతాపభ్రంశ నిబద్ధమ్" (ఆలోకము)) నియమించి యమరుకమును మాత్రముదహరించెను. ("యథా హ్యమరుకస్య కవే ర్ముక్తకాః శృంగార రసస్యందినః ప్రబంధాయమానాః ప్రసిద్ధా ఏవ" (ఆలోకము)) ప్రాకృతాపభ్రంశముల మాట తలపెట్టలేదు. దీనికి కారణమేమో! బహుశః పాదుకొనియున్న వైదికాభిమానము అతని కడ్డుదగిలియుండును ఆనందవర్ధనుని కాలమునాటికే ప్రాకృత గాథలు అంతులేని పలుకుబడి నార్జించినవి. ధ్వన్యాలోకము వంటి గ్రంథమున ఉదాహరింపవలసినంతటి యసాధారణ గౌరవముకూడ వానికి లభించినది. సామాన్య జనుల హృదయములు ప్రాకృతోద్యానములలోని చల్లని వాతావరణమున కున్మస్తములై దుసికిళ్ళులాడినవి వారి జీవితములలో, తలపులలో ప్రాకృత గాథల స్వభావమధురములగు రస తరంగములు చొచ్చుకొని పోయినవి నిజముగా ముక్తకములు రచించుట మనమనుకొనునంత సులభకార్యముగాదు వానిని సృష్టించుటకు 'మహాకవి' గావలెను ఎన్నియో దినములు హృదయారామములయందు ప్రోదిగొని పెరిగి పెరిగి వికసించి కనుపించిన మనోహర పుష్పగుచ్ఛములు ముక్తకములు. భాషయందు బిగువు సడలినను, భావమున పసిమి తగ్గినను వారి రచన రక్తిగట్టదు. ఖండ కావ్యములు, కావ్యములు మొదలగువాని 'సోదె' వేరు వానికిని, చాటువులకును హస్తిమశకాంతరమగు భేదమున్నది.

కావ్యరచనలో కవికి స్వయముగా నొకవైపు నుండి సహాయమున్నది. పఠితల మనస్సుల పూర్వాపరముల లగింపునకును, కథా సందర్భమునకును కొంతవరకు లొంగిపోవును. రఘువంశమున సూచీ బేద్యమగు నా కటిక చీకటిలో - ఆ యర్ధరాత్రిలో తల్పమున బవ్వళించి యున్న కుశమహారాజు దగ్గరకు అయోధ్యాపురాధి దేవత వచ్చిన దనుకొనుడు. అప్పుడా ధర్మమూర్తి పూర్వార్ధ విసృష్టతల్పుడై' భయ, విస్మయ పాపశంకలు ముప్పిరిగొన

"కాత్వం శుభే కస్య పరిగ్రహోవా
కింవా మదభ్యాగమ కారణం తే"

అని హెచ్చరించినాడు. ఈ శ్లోకమును చదివిన వెంటనే మనకు దెలియకను యెడద ద్రవించును. కన్నులలోనుండి రెండు నీటి బొట్టులు రాలును ఇందులో నేరసమును దీవ్రముగా వర్ణింపబడలేదుగదా! భవభూతి రామునివలె కుశుడు కుమిలి కుంపటియైనాడా? అతనికే దుఃఖమున్నది? ఒక పాప శంకయే యప్పుడాతనిలో నున్న ప్రధాన భావము మఱి మనము కన్నీరు విడుచుటకు గారణమేమి? పూర్తిగా సందర్భ శుద్ధియే. కుశ మహారాజుపై మనకు సంపూర్ణమగు నాదరాభిమానములు గలవు. రఘువంశము ధర్మైకనిష్ఠమను నమ్మకము, గౌరవము మన హృదయములోని తుది తెక్కవఱకును వ్యాపించిపోయినవి. అయోధ్యా పురాధిదేవతకు సంభవించిన దుఃఖమునకై సంపూర్ణమగు సానుభూతి గలదు "అర్ధరాత్రము, స్తిమిత ప్రదీప"మను పూర్వశ్లోకములోని రెండు విశేషణములను మనమునకు రిచ్చపాటొదవించి కలుగబోవు రసానుభూతికి దగిన పూర్వరంగమును గల్పించినవి. అతని ధర్మపరతతో మన దగ్గజీవితమును అప్రయత్నముగా కనుఱెప్పపాటులో బోల్చుకున్నాము. ఈ యన్నిభావముల మననతో శ్లోకము పూర్తిగాక మునుపే మన కనుఱెప్పల తుదల కన్నీరు నిలిచినది. అట్టియెడ నెంత లలితతర భావమైనను మన హృదయముల నల్లలనాడించును వెంటనే యేర్తుము. కాని, చాటువులలో నట్లుగాదు అవి స్వయముగా దమ కాళ్లపైననే నిలువవలెను. ఇరుగుపొరుగు చాటువులు పరస్పరము సాయము చేసికొను నాచారము వానికి లేదు. ఉన్నను రమణీయముగాదు. అవి స్వతంత్రములు. ఒకవేళ 'కుళకములు' మొదలగువానిలో పూర్వాపర సంబంధములుండు పద్ధతి లేదా యని యడుగుదురేమో! అట్టిచోటులలో శాస్త్రమును పూజించుటకు మాత్రము ముక్తకములని యొప్పుకొన్నను వానికా స్వరూపము కొఱతపడినదని నిష్కరుణముగా చెప్పవలసి వచ్చును. సత్యమిట్లుండుటచే చాటువులను విచారించునప్పుడు వానికి ప్రత్యేకముగనే వెలకట్టవలసి వచ్చును. చూడుడు

"కిం రు అసి ఓణఅముహీ
ధవలా అంతేసు సాలిఛేత్తేసు,
హరి ఆలమండి అముహీ
సడివ్వ సణవాడి ఆ జా ఆ"

(కిం రోదిష్య త్యపనతముఖీ
ధవలాయమానేషు
హరితాళమండితముఖీ
నటీవ శణవాటికా జాతా)

ఈ ఛందమున నాయికయు మన కపరిచితయే ఆమెపై సానుభూతిగల దూతికయు మన మెరిగినది కాదు వీరిరువును మన భావనాదృష్టికి నీడలుగా వస్తుమాత్రములుగా గానబడదు రంతే! ఇరువురి యందును మనకు ద్వేషమును లేదు, పక్షపాత మసలేలేదు. కాగా ఆదరమో, ద్వేషమో ఏ భావము కాని యీముక్తకము

నుండియే కలుగవలయును పిచికారుతో గొట్టినట్లు ఒక్కసారి తలపుల నుద్దీపింపజేసి సర్వాంగ సుందరముగా దిద్ది తీర్చి తకతకలాడించు శక్తిగలదే ముక్తకము. అందుచే కావ్యకవిత్వమునకన్నను వీని రచన సులభముగాదు. మరి కష్టతరము. ప్రబంధాంతర్వర్తులగు వానివలె చాటువులలో కథలు వర్ణింప బడవు. మఱి క్షణక్షణ వినిర్భిన్నములగు మనోభావములు, సముజ్జ్వలితములగు వాని యనుభవములు. వానిలోను ప్రవృత్తి మూలకమగు శృంగారమునకే యగ్రతాంబూలము. ఇన్ని చిక్కులున్నపుడు సామాన్యుడగు కవి వీనిని నిర్వహించుటయు, మధురముగా నిర్వహించుటయు నసాధ్యమగు కార్యము. ఈ విషయమును ప్రాచీనులే గమనించి ముక్తకములకు మహోన్నత స్థానము నొసగిరి సంస్కృతము నందలి యమరుకుడు, మయూరుడు, మూకకవి మొదలగువారు ముక్తక కావ్యగ్రంథకర్తలే. మహాకవులుగా పరిగణింపబడి గౌరవింపబడినవారే. ముక్తకములలో కూడ దేశభాషలలోని రచనములే మధురతరములు కారణ మేమందురా, సామాన్య జీవితమునందు దేశభాషల కున్నంత చొరవ గీర్వాణమున కుండదు, ఉండలేదుకూడ. గీర్వాణము వ్యావహారికముగనో, శిష్టవ్యావహారికముగనో యుండెననుట యింకను పండితులు పరీక్షించి తేల్చవలసిన విషయము. ఒకవేళ నున్నను నానాటి రచనలు కావ్యములు చాలవఱకు దొరకలేదనుట మాత్రము నిశ్చయము. భవభూతి కాలమునాటికే ఇంకను నంతకన్న కొంచెము ముందుగనే సంస్కృతము వల్లెవేసి నేర్వవలసిన భాషగా నుండెను. వ్యాస వాల్మీకులకు సంస్కృతము నందున్నంత ఛొరవ భాసకాళిదాసులకు లేదని సహృదయులకు దెలిసిన విషయమే! మఱి యే పుణ్యయోగముననో వారి కాలమున కాసంత వ్యాప్తి యుండబట్టియే తక్కిన కవులకన్నను వారి రచనలు మధురముగా నున్నవి. తరువాతివారి కాభాగ్యము కూడ బట్టలేదు. నిఘంటువుల జూచియు, వ్యాకరణ సహాయమునను భాష నభ్యసించుచుండిరి. ఒక పదమునకు వ్యావహారికముగా కాక, దానితో పూరింపబడిన భావనతో గాక నిఘంటువుల జూచి యర్థము చేసికొన్నచో నాపదశక్తి యర్థము చచ్చినట్లే! కాగా వారి గీర్వాణము చైతన్య యుక్తమగు భాషగాక కేవలము జీవములేని శరీరముగనే తయారైనది. మృచ్ఛ కటికములోని సంస్కృతము కూడ దానిలోని ప్రాకృతమంత మధురముగాలేదు. ప్రాకృతములానాడు సామాన్యజనుల భావములలో చొచ్చుకొని యుండుటయు, సంస్కృతము లేకపోవుటయునే దీనికి కారణము. సంస్కృతమున కీ విషమయోగము పట్టియుండబట్టియే దానిలోని రచనలుకాని, ముక్తకములుగాని జీవితముతో గాఢముగా పొత్తు కుదుర్చుకొనలేదు. ఈ లోపమును గ్రహించియే ప్రాచీన పండితులు తమ పాండిత్య బలముచే దానిని పూరింప జొచ్చిరి. ప్రాకృతాపభ్రంశములయు, నితర దేశభాషలయు స్థితి యట్లుకాదు. జీవితములతో వానికి సాక్షాత్తుగా సంబంధముండినది. ప్రతియింటను అమ్మలక్కల సంభాషణములలో ప్రాకృతపదములు దొరలిపోయినవి. జైను లర్ధమాగధిని, బౌద్ధులు పాళీ భాషను పట్టుపట్టి పోషించిరి. అందుచే సామాన్యుల భావములు ఆ భాషలలో సులభముగా, స్పష్టముగా ప్రతిబింబించును. నిజముగా ధ్వనికారునివంటి రసికచక్రవర్తి గాథాసప్తశతిని

తలచి యుండినను అతనికొక గొప్ప యలంకారముగనే యుండియుండెడివి. కాని యాపని నాతడు చేయలేదు. వాని యపరాధము అవి వైదిక మతములకు విరుద్ధముగా నుండుటయే! నిజముగానది మన దురదృష్టము.

## గాథాసప్తశతి :

గాథాసప్తశతీ సంకలనమే ప్రాకృతభాషలలో ప్రాచీనమైనది. అంతకుముం దుండిన ప్రాకృత కావ్యముల స్వభావ మెట్టిదో మన మెరుగము. సప్తశతిలోనే కొన్ని ప్రాకృత కవినామము లుల్లేఖింపబడియున్నవి మకరందసేనుడు, అమర రాయడు, కుమారిలుడు, భీమస్వామి మొదలగు కొందరు కవులు ప్రాకృతభాషలలో ప్రసిద్ధులని తెలియుచున్నది ఆ నామములను బట్టిచూడ సప్తశతీ కాలమునకు ముందుగా కూడ కొన్ని ప్రాకృత కావ్యములు రమణీయములైనవి యుండెననుట స్పష్టము. కీత్తు మహాశయుడు మాత్రము కాళిదాసు కాలమునకు కొంచెము ముందుగనో వెనుకలనో ప్రాకృతకవులుండిరని తన యభిప్రాయమును ప్రకటించినాడు ఒకవేళ గాథల కాలముకన్న ముందే ప్రాకృత కావ్యకర్తలుండినను తనివిదీర నల్లుకొన్న గీర్వాణధాటికి తాళి నిలిచియుండవు. చారిత్రక దృష్టితో బరిశీలించినను, కావ్య హృదయముతో భావించినను సప్తశతీ కాలమే ప్రాకృత భాషలకు చాల నదృష్టము పట్టిన సమయము భాష నిగ్గులు దేరినది. భావములు తకతకలాడినవి. భాషయును, బావమును సామాన్య మానవజీవితము తుదియంచులలో వేరు పరానంత గాఢముగా నదుకుకొనిపోయినవి. నాడు ప్రతియింటను ప్రాకృత భాషాజ్యోతులు వెలుగుచుండె ననుట కింతమాత్రము చాలును. పెద్దకాలము ముసలి ముత్తయిదువ గీర్వాణ సరస్వతి విశ్రాంతి గైకొన్నది. మధుర మందహాసములతో నవోఢ-ప్రాకృతభాషాంగన కావ్య రంగముల గొండ్లి సంచరించినది. ఎచ్చట జూచినను,

"లలిఏ మహురక్ఖర ఏ
జువ ఈజణవల్లహే ససింగారే,
సంతే పాఇఅకవ్వే
కో సక్కఇ సక్కయం పడిఉం"

(లలితే మధురాక్షరే
యువతీ జనవల్లభే సశృంగారే,
సతి ప్రాకృతకావ్యే
కశ్శక్నోతి సంస్కృతం పఠితుం.)

అను విజయ నినాదములు దిక్కులు మారుమ్రోగునట్లు ప్రతిధ్వనించినవి. ఆ శుభముహూర్తముననే చక్రవర్తియు, రసిక చక్రవర్తియు నగు హాలుడు గాథా సంకలనమునకు బూనుకొన్నాడు. ఇతడు కుంతలాధీశ్వరుడు. కామగిరి మొదలు ద్వారకాంతము కుంతల దేశమని శక్తి సంగమతంత్రమున కలదు. (కామగిరిం

సమారభ్య ద్వారకాంతం మహేశ్వరి, శ్రీ కుంతలాభిధో దేశో హూణ దేశం (శృణుప్రియే.) ప్రతిష్ఠాన పట్టణము హాలుని రాజదాని. ("శ్రీమత్కుంతల జనపదేశ్వర, ప్రతిష్ఠాన పట్టణాధీశ" (పీటర్స్‌గారి ప్రతి)) ఉత్తరము- నందలి ఘూర్జరము కూడ ఇతనికే లోబడి యుండెను శివశర్మయను బ్రాహ్మణుడొకడు తన్ను మెప్పింపగా 'భరకుచ్ఛము' నాతనికి దానమిచ్చినట్లు కథాసరిత్సా గరమున కలదు.

(రాజార్థరత్న నిచయై రథ శర్వపర్మా
తేనార్చితో గురురితి ప్రణయేన రాజ్ఞా,
స్వాహీకృతశ్చ విషయే భరుకుచ్ఛనామ్ని
కూలోపకంఠవినివేశిని నర్మదాయాః (కథాసరిత్సాగరము))

భరోచ్ ఘూర్జరదేశములోనిదే హాలునకు శాతవాహన, శాలివాహన, శాతకర్ణులని మారుపేరులు గలవు. ఇతని తండ్రి పేరు దీపకర్ణి. ("శాతకర్ణోపనామకదీప కర్ణాత్మజ" (పీటర్సన్)) కవి వత్సలుడని హాలుని బిరుదనామమై యుండును. లేక తానై చేర్చుకొన్న సామాన్య విశేషణ స్వరూపమైనను కావచ్చును శాతవాహనుడు మలయవతీ ప్రాణనాధుడు ("మలయవతీ ప్రాణప్రియ") ఆంధ్రదేశమున శాలివాహన శకమును వెలయంచిన దీతడే ఈ విషయమును మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాదుగారు హైమకోశాధి ప్రమాణముల నుల్లేఖించి సమర్థించిరి. శాతవాహనుడు పండితుడు. చల్లని ప్రాకృతమున చక్కని కవిత లల్లగలవాడు గాథాసప్తశతిలో నెన్నియో వృత్తములీహాలుని పేరిట గలవు పండితాదరణశీలి! భూత భాషలో కథాసరిత్సాగరమును రచించిన గుణాఢ్యుడీతని యాస్థాన పండితుడే. ఇతనినే యాచార్య గోవర్ధనుడు

"అతిదీర్ఘ జీవిదోషాత్
వ్యాసేన యశోపహారితం హంత!
కై ర్నో చ్యేత గుణాఢ్యః
స ఏవ రూపాంతరాపన్నః"

అని బ్రహ్మాండముగా బొగడెను శ్రీపాలితుడీతని నాశ్రయించియే బ్రతికెను ("హాలే నోత్తమ పూజయా కవి వృష శ్రీపాలితో లాలితః" (అభినంది రామచరితము))

శాతవాహనుడు బ్రాకృతముల నమితముగా పోషించెను. నాడు ప్రాకృత మెన్నడును కని విని యెరుగని మహోన్నత స్థానము నాక్రమించినది. ఇందుచేతనే హాలుని గురించి యీ ముక్తకము బయలుదేరినది

"కే నాసన్నాఢ్యరాజస్య
రాజ్యే ప్రాకృతభాషిణః,
కాలే శ్రీ సాహసాంకస్య
కే న సంస్కృతభాషిణః"

ఆద్య రాజనగా శాలివాహనుడు ("ఆఢ్యరాజ శ్చాలివాహనః సాహసాంకో విక్రమాదిత్యః" - రత్నేశ్వరమిత్రుడు) రసికుడును, భావుకుడును, నిర్మాతయు నగు హాలుని కూర్పుచేత నాతని సమకాలికులయు, ప్రాచీనులయు భావ రత్నములు కాలవాహినిలో స్థిరముగా నిలిచినవి

భట్టబాణుడు తన హర్ష చరితములో
"అవినాశిన మగ్రామ్య
మకరో చ్ఛాత వాహనః,
విశుద్ధజాతిభిః కోశం
రత్నై రివ సుభాషితైః"

అని యభినందించెను. ఇందలి కృదాతువుచే హాలుడే రచయిత యగునని పొరపడరాదు ఆ ప్రయోగ మౌపచారికము మాత్రమే. గాధాసప్తశతిలో వివిధ గ్రంథకర్తల నామములును గానబడుచున్నవి అంతేకాక ప్రతియాశ్వాసాంతమునను హాలుడు 'కవివత్సల ప్రముఖ సుకవి నిర్మితే' యని వ్రాసికొనెను. ఇందలి ప్రముఖ శబ్దముచే మఱికొందరు కవులున్నారనియు, వారిలో శాతవాహనుడు ముఖ్యుడనియు స్పష్టముగా తెలుచున్నది ఒకవేళ ప్రముఖ శబ్దమును సామాన్య విశేషణ మాత్రముగా చేసి సాధించుకొన్నను, ప్రథమ శతకములోని

"సత్తసతాఇం కయివ
చ్ఛళేన కోడీ అమజ్ఞ ఆరమ్మి,
హాలేఖ విరఇయా ఇం
సాలంకారాణగాహాణమ్"

(సప్తశతాని కవివత్సలేన కోటేర్మధ్యే
హాలేక విరచితాని సాలంకారాణాం గాథానాం)

అను శ్లోకమును వ్యాఖ్యానించు టీకా కారులందరును "విరచితాని-సంగృహీతా నీత్యర్థః" అనియే వ్రాసిరి ప్రాచీనులెగు వ్యాఖ్యాతలు ఒకడు గాదు పలువురు ఆరీతిని వ్రాయుట జూడగ నందులోనే సత్యముగా సత్యము గలదు. ఇంతవఱకు తార్కిక విమర్శ. ఇక కవి దృష్టితో జూచినను ఒకడే కవి యన్ని ముక్తకములు వ్రాసినాడన్నను, వ్రాసినవన్నియు అంత శృంగారరస నిర్భరములుగా నున్నవన్నను నమ్మదగిన మాటకాదు. జీవితమున కొకభావ మెంతయో గాఢముగా హత్తుకొనియున్ననే యది కావ్యమున కెక్కును, రమణీయముగా నుండును. అంతటి శృంగారము అందును కావ్యమున వర్ణింపవలెనన్నచో ఆ లోలుపత, చాపల్యము జీవితమున నెంతయో యభిన్నముగా చేరియుండవలెను. అంతటి చాపల్యము నొకటే మానవ జీవిత మరిగించుకొనలేదు నిజముగా నీ ముక్తక కావ్యమునంతయు హాలుడే వ్రాసియున్నచో నాతడు నాలుగు దినములు కూడ సుఖముగా బ్రతికి రాజ్యమేలి

యుండడు అప్పుడు సప్తశతియే యుండదు. గోవర్ధనాచార్యుడొక్కడే సప్తశతిని వ్రాయలేదా యని మీరడుగవచ్చును కాని గోవర్ధనుని కలము పోటులకును, ప్రాకృతకవుల లలిత కుంచికలకును నెంతయో బేధము కలదు

ఆచార్య గోవర్ధనుని సప్తశతి శృంగారపు సీమల నంటనే లేదు. కాని ప్రాకృతములోని ప్రతి గాధయు శృంగార సముద్రములోని కడపటి యంచులో నోత ప్రోతముగ మునిగితేలినది కనుక దానితో దీనిని పోల్చి చూడరాదు అది యట్లుండె.

ఇంతేకాక గాథాసప్తశతిని చదివినపుడు అందులో వివిధ హస్తములు స్పష్టముగా కనిపించుచున్నవి. ప్రతి ముక్తకమునందును పరస్పరము భావములో, భాషలో నెన్నియో సూక్ష్మసూక్ష్మతర బేధములున్నవి. వివిధములగు మనస్తత్వములు, రుచిబేధములు దీర్ఘముగా మెడలు సాచినవి. అట్టియెడ నివి యన్నియు పెద్ద విపరీత వాదమే!

హాలుడు రాజు. ఒకవేళ నాతడెంత సహృదయుడైనను ప్రజా రంజకుడైనను సప్తశతిలో చెప్పినంత గంభీరముగ గ్రామ్యజనుల జీవితము నర్ధము చేసికొని యుండడు అతనికేగాదు, ఎవ్వనికైనను నట్టి దసంభవమే. కాగా, మధురమధురమగు పల్లీ జీవితమును, మధురాతి మధురములగు వారి భావములును ఏనాడును ఆ సుఖమే యెరుగని ఎరిగినను నంత గాఢముగా పట్టుపడని హాలున, కంటగట్టుట కంటెను ఒకరాజు సహృదయత గల కవి యితరుల రచనలకు ముగ్ధుడై వాని నన్నిటిని బోగొట్టక సేకరించినాడనుటలో శాతవాహనునకును, మనకును గౌరవమేకాని యమర్యాద లేదు. గాథాసప్తశతిలో రాజవర్ణనలున్నవి హాలునివంటి చక్రవర్తి అభిమాన ధనుడు ఇతర రాజుల నెందుకు వర్ణించును? ఒకవేళ తన్నే తాను వర్ణించుకొని గ్రంధమున చేర్చి యుండగూడదా యని యందురేమో? నిజముగా నా తలపు హాలభూపతికే మనము చేయు మహాద్రోహమగును. శాతవాహనుని వంటి రసికుడాపని చేసెననుట కంటె ఆంధ్రులకు మఱియొక యవమానములేదు. కనుక నర్థములేని యభినివేశముతో లేనిపోని విపరీత సృష్టి చేసి హాలుడు సప్తశతీ రచయిత యని సాధించుటకంటెను 'సంగ్రహకర్త' యనుటయే న్యాయము, మనకు మర్యాద కూడ.

హాలుడీ గాధలను సంగ్రహింపనే లేదనియు, గుణాఢ్యుడో మఱియెవరో కూర్చి ధనాశచే నితని పేరుంచి యుందురనియు భట్టశ్రీ మథురానాథశాస్త్రిగారి మఱియొక వాదము. అసలు మన పరిశోధకులకు రాజులపై నేదో యొక వింత కంటగింపు. వారు శుద్ధ సోమరిపోతులని వీరి నమ్మకము తిరుమల నాయని గీత గోవింద వ్యాఖ్యకును, కృష్ణరాయల యాముక్త మాల్యదకును, వేమాధీశుని యమరుక వ్యాఖ్యానమునకును గూడ నీ యన్యాయము జరిగినది. భట్టశ్రీ మథురానాథశాస్త్రిగారే తమ పీఠికలో మఱియొకచోట హాలుడు కవి యనియు, మధుర కవి యనియు పొగడిరి. ("రాత్రిందివం కవిగోష్ఠి పటిష్ఠ స్తన్మీమాంసాభి నివిష్టతయా, తత్పరినిష్ఠమతిః సోయం స్వయమపి కవయతిస్మ, సుమధురంచ కవయతిస్మ" (గాథాసప్తశతీ పీఠిక))

ఇంతలోనే ఈ విపరీత శంక యెందుకు కలిగెనో తెలియదు. వారి వాదమున కుపస్కారముగ శాస్త్రిగారు చూపిన కారణములు రెండు ఒకటి గుణాఢ్యుడు హాలుని యాస్థానమున నుండెను ఈ కారణము చాల దుర్బలమని యతి సులభముగనే తెలియుచున్నది గుణాఢ్యు డక్కడ నుండుటచే నాతడే గాథలను కూర్చియుండు ననుటలో ప్రమాణమేమి? ఆశ్రయించుటయే ప్రమాణమనుట పరిహాసాస్పదము. ఇక రెండవ కారణమేదనగా . హాల భూపతిని వర్ణించిన గాథలు సప్తశతిలో నుండుట. ఇది యంత పెద్ద బాధకము గాజాలదు సమకాలికుడుగా నుండి, ధనార్థియై తన దగ్గఱకు వచ్చిన యెవ్వరో కవి తన్ను వర్ణించి యుండవచ్చును. భావ ముగ్ధుడగు హాలుడు కొంచెము కీర్తి చాపల్యముతో వానిని గ్రంథమున చేర్చియుండును అంతమాత్రముచేతనే హాలుడు 'సంకలనకర్త'యే కాడనుట పరమాన్యాయము.

గాథాసప్తశతిలోని ప్రధాన రసము శృంగారము. నీతి మొదలగు విషయములను గురించిన శ్లోకములును మ ధురములు లేకపోలేదు. కాని చాల తక్కువ. సప్తశతిలోని శృంగారము విశ్వరూపమును దాల్చినది. ఆ కవులకు జగత్తే శృంగారమయము, సౌఖ్యమయమైనది. కొన్ని యెడల వారి రసికతకు మన హృదయ శరీరములు రెండును కంపించును. ప్రకృతి ప్రాకృత గాథలలో విచికిల స్వరూపమును దాల్చి జగన్మోహినియైనది. గడ్డి గాదములతో, పైరు పచ్చలతో ప్రకృతి చిఱునవ్వు నవ్వినట్లున్న గ్రామములను విడిచి ప్రాసాదములవంక ప్రాకృత కవులు చూడనే లేదు. రాచరికములోని మర్యాద, డంబము స్వభావ మధురములగు నీ సౌందర్యములకు ముందు దిగదుడిచినట్లు వారికి గనుపించినవి. ప్రాకృత కవులకు దొరికిన నాయికలు యౌవనము పోతరించిన పల్లీ విలాసినులు. ఉన్ముక్త వాతావరణమున కెరిగి, కండలు దేరి యున్నత్తతరమగు దాహము గల గ్రామ నివాసులు నాయకులు. స్వభావ రమణీయమ లగు గ్రామ పరిసరములు ప్రమోద స్థానములు. ప్రోదిగా బెరిగిన నికుంజములు విహరణ స్థానములు. హరిత హరితములై, నిబిడ సస్యాచ్ఛాదితములై శృంగారరసాధి దేవతకు నాట్యమండపములు వోని పరిసరక్షేత్రములు అభిసరణ ప్రదేశములు. మయూర నృత్యములు, శరన్మేఘములు, వర్షాకాల ప్రవాహములు వర్ణింపదగిన విషయములు. ఏముక్తకమున బట్టినను సామాన్యత. స్వాభావికత, రసాభిముఖత తొణికిసలాడుచుండును. ఒకదానిని చూచిన కంట నొకదానిని జూడరాదు. సప్తశతి యొక కల్పవృక్షము. ప్రతిచ్ఛందమును నొక విచికిల పుష్పగుచ్ఛము భావాంబరమున కెగసిన చాటు ధారలు తారలై నిలిచినవి. వానిని చదువుటకును, చదివి గ్రహించుటకును తగిన హృదయములు క్రుళ్ళిపోయినవి. గాథాసప్తశతి నొకమారు తిలకించితిమేని యొకనాడంతటి మహోన్నతమగు సుఖముల ననుభవించి చైతన్యశక్తిని మూటకట్టుకొన్న రసికాంధ్రజాతి యిదియేనా యని యనుమానము కలుగుచుండును నిజముగా ప్రతి యాంధ్రుడును చదివితీరదగినది సప్తశతి. చదువుటయేకాదు, ఉపాసించి

తపించిపోవలెను. దానినుండి రెండు శ్లోకములనుమాత్రముదాహరించుట నాకు జూడ దాని గౌరవమును కొరత పఱచుటయే! ప్రతి గాధయును నుదాహరింపదగినదే! అట్టి యద్వితీయ రచనముల నాంధ్రుల కందించిన హాలుడు ధన్యుడు. వానిని చదువక ప్రాకృతముల నుపేక్షించిన మనమును ధన్యులమే!

సప్తశతీరచనమునకు తరువాత దాని యనుకరణములెన్నియో బయలుదేరినవి రసలుబ్ధులగు నితర కవులు గాధార్థముల నెన్నిటినో తమ కావ్యముల జేర్చుకొనిరి. వాని విచారము మన కిప్పుడంత యక్కరలేదు కాని 'సప్తశతి' యన్న పేరునే పెట్టుకొని గాథలనే యనుసరించిన రచనలును బయలుదేరినవి అట్టిది తొలుత సంస్కృతముననే పుట్టినది అదియే గోవర్ధనాచార్య సప్తశతి

## గోవర్ధనాచార్య సప్తశతి :

దీనిని వ్రాసినయతడు గోవర్ధనుడే. అనగా నిది సప్తశతి వంటి కూర్పు కాదు. మరి గోవర్ధనుడే చేసిన స్వతంత్ర రచన. ఇతడు పండ్రెండవ శతాబ్దము కడపటివాడు. బెంగాలు దేశమునందు మహాప్రసిద్ధుడగు లక్ష్మణ సేనుని యాస్థాన కవి. ఆ కాలపు వారిలో గోవర్ధనుడెక్కువపేరు పెంపులు గలవాడు. గీతగోవిందకర్త జయదేవుడు "శృంగారోత్తర సత్ప్రమేయ రచనైరాచార్య గోవర్ధనస్పర్ధీ కోపి న విశ్రుతః " అని పొగడెను. ఉమాపతి ధరుడు, శరణుడు, ధోయీ కవి మొదలగు వారీతని సమకాలికులు ("వాచం పల్లవయ్య త్యుమాపతిధరః" (గీతగోవిందము)) గాథా సప్తశతికి బట్టిన యీ మహత్తరమగు గౌరవమునకు సంస్కృత పక్షపాతియగు గోవర్ధనుడు సహింపలేకపోయెను. గీర్వాణ భాషయందును ప్రాకృత గాధలయందలి సొగసును సృష్టించి గౌరవము సంపాదించి సాహితీ సింహాసన పట్టబద్రుడగుటకు యత్నించెను. ఈ పూనిక నిజముగా నసాధరణమైనదే! ఈ సందేహ మాతనికే లేకపోలేదు. గోవర్ధనుడే సముచితముగ "వాణీ ప్రకాకృత సముచిత రసా బలేనైవ సంస్కృతం నీతా" అని తన గ్రంథముననే చెప్పుకొనెను. సత్యమే! శృంగారమునకు ప్రాకృత భాషలే తగినవి. వానిలో సెలలవంటి చలువ యున్నది. వసంతముల యందలి మాకందపుష్పగుచ్ఛములలోని తావి యున్నది ముగ్ధమనోరధములలోని మధురత యున్నది. గంభీరమగు గీర్వాణమునకు సుధురమగు శృంగారముతో పొత్తు కుదరదు. రాజశేఖరుడు

"పరాసా సక్క అ బంధా
పాఇఅబంధోవి హోఇ సుఉమారో
పురుస మహిలా ణ జేత్తియ
మిహంతరం తేత్తిఅమిమాణం" (కర్పూర మంజరి)

(పరుషా స్సంస్కృతబంధా! ప్రకాకృబంధోపి భవతి సుకుమార పురుషమహిళానాం యావదిహాంతరం తావదే తేషాం)

ప్రాకృత కవులును
"అమిఅం పాఉ అకవ్వం
ఫడిఉం సోఉం అ యే ణ బాణంతి,
కామస్స తత్తతంతిం
కుణంతి తే కహ ణ లజ్జంతి"
(అమృతం ప్రాకృతకావ్యం పఠితుం శ్రోతుంచయే న సానంతి, కామస్యతత్వచింతం కుర్వంతస్తే కధం సలజ్జంతే)

అని ప్రపంచమునే సవాలుకు తీసిరి.

కాని, గోవర్ధనునిది కండగల భాష. ఆతని యార్యలు సుందరములు గోవర్ధనుని తరువాత అప్పయ దీక్షితుల వఱకును ఆర్యల నంత సరసముగా నడిపిన వారు సంస్కృతమున సామాన్యముగా లేరు తోలు మలచుకొని మెలికలు దిరిగిపోవు కోడెత్రాచులవలె గోవర్ధనుని యార్యలు లెక్కలేక పరుగెత్తును. ఈ విషయమును తానే

"మసృణపదరీతిగతయః
సజ్జనహృదయాభిసారికాః సురసాః,
మదనాద్వయోపనిషదో
విశదా గోవర్ధనస్యార్యాః"
అని చెప్పుకొనెను.
గ్రంధము నంతయు రచించి కృతార్థుడైన వాడువోలె,
"కవి సమరసింహనాదః
స్వరానువాద స్సుధైక సంవాదః
విద్వద్వినోదకందః
సందర్భోయం మయా సృష్టః"

ఇత్యాదులతో బాహాటముగా తన యాత్మ తృప్తిని వెల్లడించెను. సంస్కృత దృష్టితో జూచినప్పుడు గోవర్ధనుడితరు లెవ్వరికిని దీసిపోవువాడుకాడు. సాధ్యమైనంత వఱకు శైలి లలితపాకముననే పడినది. కాని యినుప దూలముల వంటి గోవర్ధనుని సంస్కృత శయ్యలో, యమకములతో తూగాడు నాతని పదధారలో, పాపము, శృంగారము నిలువలేక వణకిపోయినది. ప్రాకృత కవులననేక తావుల ననుసరించినాడు. చక్కగా ననుసరింపలేకపోయినాడు. మెరుగు లివ్వబోయినాడు. కాని మెఱుగులు తఱుగులై నిలిచినవి గోవర్ధనుని సప్తశతి స్వతంత్రముగా చదివినప్పుడు బాగుండునేమో కాని హాలుని సప్తశతితో బోల్చి చూచినప్పుడును, గాథలయందలి యమృతమును చూరలాడిన తరువాతను మాత్రము కళలు దగ్గుట నిశ్చయము.

గోవర్ధనుని సామాన్య రచన యిట్టిది

"అసతీకులజా ధీరా
ప్రౌఢా ప్రతివేశినీ యదాసక్తిమ్,
కురుతే సరస్వాచ తదా
బ్రహ్మానందం తృణం మన్యే"

కొన్ని కొన్ని చోటుల రసానుభూతిని కలిగింప బోయి విరసముగా మార్చిన పట్టులును గలవు.

"తిమిరేపి దూరదృశ్యా
కఠినాశ్లేషేచ రహసి ముఖరాచ,
శంఖమయ వలయరాజీ
గృహపతిశిరసా సహ స్ఫుటతు"

ఇందులోని అర్థము ప్రకృతరసభంగమునకు కారణము మాత్రమేకాదు. ఎప్పుడును రసికుడు తలపనేరానంత యసహ్యముగా నున్నది.

గాథలయందు కపటచేష్ట చేత నుపపతి గృహ గమనము వర్ణింపబడినది.

"పరిపరవోవ్విఅణిజ్జఇ
విచ్ఛుఅదట్ఠేత్తి జారవేజ్జ ఘరమ్
నిపుణసహీకరధారిఅ
భుయజుఅలందోళిణీ బాలా"

[పతిపుంత ఏవనీయతే
వృశ్చికదష్టేతి జారవైద్యగృహం
నిపుణసఖీ కరధృతా
భుజయుగళాందోలనశీలా బాలా]

ఆర్యాకారుడు సృష్టించిన నాయిక మగని యెదుటనే విలజ్జయై, విగత భయయై 'పచ్చిపోకిరిదాని'వలె నిట్లనుచున్నది .

"గృహపతిపురతో జారం
కపటకథాకథితమన్మథావస్థం,
ప్రీణయతి పీడయతిచ
బాలా! నిశ్వస్యవిశ్వస్య"

ఆహా! ఏమి శృంగారము! ఎంత యౌచిత్యము! గాథాకారుడు చౌర్యరతిని వర్ణించుచు ఈ రీతి చెప్పెను :

"అహఅమ్మి అదోఅజ్జ
కులహరావోత్తి ఛేంఛీజారం,

సహసాగఅస్సతురిఅం
పిణోకంఠంమిలావేఇ"

(అసావస్మాకమాగతోద్య
కుంగృహాది త్యసతీ జారం,
సహసా గతస్య త్వరితం
పత్యుః కంఠే లగయతి.)

ఆర్యాసప్తశతిలోని నాయిక చౌర్యరతిలోని స్వారస్యములు భావించుకొని లొట్టలువైచుచు తానే స్వయముగా ముందుకువచ్చి

"శ్రోణీ భూమా వంగే
ప్రియో భయం మనసి పతిభుజే మౌళిః,
గాఢశ్వాసో వదనే
సురతమిదం చేత్తృణం త్రిదివం"

అని యన్నది. దీనికి వ్యాఖ్యానకారుడు వ్రాసిన పీఠిక యింకను మెఱుగుగా నున్నది. చీకటిరాత్రియట, భర్తయు తానును పండుకొన్నారట. ఆ చీకటిలో ప్రియుని బాహువు నుపధానముగా చేసికొని యుపపతితో క్రీడించుచున్నదట. ఆహా ఏమి పీఠిక! ఏమి మూలస్వారస్యము! ఆచార్య గోవర్ధనుని రచనలో ననౌచిత్యము ప్రోదిచేసికొన్నది. గాథాకారుడు నగ్నస్త్రీని వర్ణించుచు

"అచ్ఛేరంవ ణిహింవియ
సగ్గే రజ్జంవ అనుయపాణంవ,
ఆసీఁహ తరాముహుత్తం
విణియంసణదంసణం తీయే"

(ఆశ్చర్యమివ నిధిమివ
స్వర్గే రాజ్యమివామృత పానమివ,
ఆసీదస్మాకం తన్ముహూర్తం
వినివసనదర్శనం తస్యాః)

అని ముహూర్తములో ఆ దృశ్యమునకు తెఱవైచెను. యమునానదీతరంగ ప్రతిబింబితమగు చంద్రబింబమువోలె నాభావముకనపడియు కనపడక తరళసుందరమై యున్నది. ఆర్యాకారుడు నగ్న శృంగారమును అవసరము కలిగినప్పుడంతయును తీరికగా వర్ణించెను.

సంస్కృతము తరువాత గాథానుకరణము, సప్తశతీ రచన వ్రజభాషలో జరిగినవి. గీర్వాణమునకును, వ్రజభాషకును గల యాంతరిక సంబంధమును బట్టి వాని నిక్కడ దడవవలసివచ్చినది. ఆయనుకరణము పేరు బిహారీసతసయి.

**బిహారీసతసయి :**

దీనిని రచించిన కవి బిహారీ. ఇతడు జయపురపు రాజగు జయశాహుని నాశ్రయించియుండెను. జయశాహుడు విషయలంపటుడై రాజకార్యమునుగూడ నుదాసీనముగజూచి యంతఃపురముననే యుండినట్లును, అతని దర్శమున కేగిన బిహారీ కొలువు దొరకక

"నహి పరాగు నహి మధురమధు
నహి వికాస ఇహి కాల్
ఆలీ కలీమి సోభధ్యే
ఆగే కౌను హవాల్"

(ఓ మధుకరమా! ఈ పూవింకను కళిక పరాగము లేదు. మధుర మధువు లేదు. వికసనము లేదు. ఇప్పుడే దానిని విడిచిరావే! వికసించిన తరువాత నీగతి యేమగును?)

అను ఛందమును వ్రాసి మందలించి పంపినట్లును, దానితో రాజు లజ్జితుడై యథాస్థితికి వచ్చినట్లును ఒక కథ ప్రసిద్ధముగా గలదు. నాటినుండి జయశాహుడు ఒక్కొక్క వృత్తమున కొక్కొక్క బంగరు నాణెము నొసగునట్లు ప్రతిజ్ఞ చేసెను. ఆయుత్సాహమునకు బొంగి కవిరాజు కలముపట్టెను సాహిత్యోద్యానము పుష్పించెను.

ఉత్తర హిందూస్థానమున శృంగారకవులలో బిహారీనామము నాటికిని నేటికిని ఉచ్చదశలోనే యున్నది అతని గ్రంథముపై సుమారు పదునైదు వ్యాఖ్యానములు బయలుదేరినవి (ఇతనా కహ్‌దేనా హీ పర్యాప్తహోగా, కి ఇస్‌పర్‌పచాసో టీకాయే బన్‌జా నేపర్‌భీ యహ్ క్రమ్ అభీతక్ జారీహై. (దులారేలాల్ భార్గవ)) పారసీభాషలోనికిని, సంస్కృతమునకును నిది పరివర్తితమైనది.

ప్రాకృతమేయన్న, దానికన్నను సుందరమైనది వ్రజభాష. బిహారి మహారసుడు. తలపులలో, సాహితిలో నిక్కముగా వైష్ణవుడు. రాధాకృష్ణుల ప్రేమకు వలచినాడు. వారి శృంగారము పాములవలె మనసులలో పెనవేసికొన్న వలపు మనసు నాకర్షించినది భక్తియోగులు భావాంబరమునకు కడపటి మెట్టుగా నిర్ణయించిన "మధురభావము"నకు వశుడైనాడు ("మధురభావ"మనగా భగవంతుని ప్రియుని వలెను, తన్ను ప్రియురాలివలెను భావించి యుపాసించుట. "యథా వ్రజగోపికానాం" (నారదభక్తి సూత్రము)) యౌవనకాలమున భౌతిక చాలప్యములు కొంచెము విజృంభించినవి. కడకు మేలుకొని ప్రసన్నుడై తన సాహితీ సామ్రాజ్యమునకు రాధాకృష్ణుల నభిషేకించినాడు, ధన్యుడైనాడు

"జాతనకి ఝూఈ పరై
శ్యాము హరితదుతి హోయి"

(మెఱపువంటి యే రాధాదేవి తనుద్యుతి ప్రతిఫలించి నీలమేఘము వంటి కృష్ణుడు ఆకుపచ్చగా మారిపోవుచున్నాడో!)

అన్నయమ్మృత నినాదమాతని హృదంతరమున ధ్వనించిననాడే రాధారమణి కన్నులలో నీరు నిలచినది. కవివాక్కు అమరగానమైనది.

బిహారీతలపు లమృత ఖండములు, రచన స్వర్గజ్యోత్స్న, శయ్య యాతనితో మాటలాడును, నవ్వును. సంస్కృతమును చక్కగా హృదయమెరిగి యుపాసించినాడు. ప్రాకృతముల దనివిదీర జదివినాడు. సమకాలిక రాజభాషయగు ఉర్దూను చక్కగా నేర్చినాడు శబలితమగు సంస్కారముతో, సంస్కారము నలంకరించు హృదయముతో కవిత సాగించినాడు. దోహాల వంటి సంకుచిములగు ఛందములలో మహదర్థమును క్రోడీకరింపగల మనీషి(దేఖతమే ఛోటేలగై బేధ సకలశరీర్ - స్వరూపమున చిన్నదేకాని, సకలశరీరమును వేధించును) తులసీ కబీరుల తరువాత ఒక్క బిహారీయే! ఒక్కొక్కచోట పూవులు పరచినట్లు, నదీసుందరి కుచ్చెళ్ళు జార్చినట్లు, వీణాగానమునందలి మూర్ఛనలు ఆలసగతి తూగాడినట్లు, చిరుగాలి తరగలు సాగినట్లు మహాకవి బిహారీ కవితలు పొంగును. అతడు వాడువరకును ఈ పదమున కింత శక్తియున్నదని మనకు తెలియనే తెలియదు ఈ ప్రతిభతో బిహారీ రసికుల హృదయమునకు మచ్చుబూడిద చల్లినాడు. గాథాసప్తశతి కీర్తి నెన్నడో మరగింపజేసినాడు. నేటికిని వ్యంగ్యముగా గాథల నపహాస్యమాడు

"గాథమరగ జేముహకరీ
వహైమరగజే చీర్"

(మర్దితవస్త్రమున గాధాముఖ మర్దనము జేయబడినది)

అను నానుడి ఉత్తర హిందూస్థానపు జన సమాజమున మిగిలియున్నది. కాని తత్త్వము నాలోచించినచో ప్రాకృతకవులలోని ధ్వనిపుష్టి బిహారీకి లేద ఈతని వాచ్యములలోని వేడి గాథాకవులకు లేదు. శైలిని బోషించుటలో బిహారిది ఒచెయ్యి. రస ధ్వనులను పోషించుటలో గాథ లద్భుతములు ఈ మహాకవి ధారణశైలి యిట్టిది.

"రహి ఫేరి ముఖహేరి ఇత
హితసము హేచితనారి
దేరి పరత ఉరిపీఠకే
పులకైకహాత పుకారి"

(ఒకదాని చెలియనుచున్నది ఓసీ ప్రియునియందు నీకు గల యనురాగము మాకు దెలియకుండుటకు అతడు చూచుచున్నపుడు మావైపు మెడ త్రిప్పితివి. కాని నాయకుని దృష్టిస్పర్శచే నీ వీపు పులకరించి నీ యనురాగమును చాటిచెప్పుచున్నది.)

పదములవిసెపూవులవలె, చిలుకల చాలువలె బారులుదీరి నిలిచినవి. భాష సహజనియమ మను 'తుక్‌బంది' యలసాలనముగా నవ్వుచున్నది. శృంగారము మధురమై మధురతరములగు స్వప్నలోకములకు దారితీయుచున్నది. రీతివిషయమున బిహారీ నెవ్వరును మించలేరు. ఆ చమత్కారము, పదములను నిద్రలేపి యలంకరించి వదలిపెట్టు నా ప్రతిభ అతనికే తెలియును గాథల ననుకరించినాడు. అనుకరించినా డనగా మక్కికి మక్కి, తూచాతప్పక యనుసరించుటయనియు, లేక భాషాంతరీకరణ మనియు నాతలపుగాదు. గోవర్ధనుడు కూడనట్లు చేయలేదు మరి యనుకరణమనగా గాథలను చదివి తత్సదృశములనో, సజాతీయములనో సృష్టించుట. గాథల చాయల ననుసరించినచోట చాలవఱకు బిహారీ సరికిసరిగనే నిలచినాడు. కొన్నిచోటుల పదచాపల్యమునకు లోబడి యర్థసౌభాగ్యమును లెక్కసేయక పోయినాడు. అదియొక చాపల్యము. బిహారీ వ్యాఖ్యానకర్త లందరును తమ గ్రంథములలో నక్కడక్కడ గాథలను దడవిచూచుట వాడుక. దోహాఛందములతో వానిని పోల్చిచూచి "మజ్‌మూన్ ఛీన్‌లియా", "కోసోం పీఛే ఛోడ్‌దియా" యిత్యా ద్యభినందనములచే వ్రజభాషాకవి కుత్కర్షను సాధింప యత్నింతురు. కాని నిష్పాక్షికముగా జూచినచో బిహారీ గాథల నెప్పటికిని మించిపోలేదు. అమాయకమగు నా ప్రాకృతశృంగారము, స్వాభావికతయొక్క యెల్లలు దాటని యలంకారములు గాథలలో దప్ప మరియెక్కడను దొరకవు. బిహారీకాలము మొగలు సామ్రాజ్యమునాటిది అగుటచే నతడు శాంతినెంతగా సాధించినను ఆనాటి రాజసము పోలేదు. తిన్నగా దాగియుండి శైలిలో నేనున్నా ననుచున్నది. బిహారీకవితకు ఉరవడియున్నది. ఎండకాలమున తిన్నగా ప్రవహించు సెలయేరులలోని నఖంపచములగు జలముల వంటి దాతని రచన, ప్రాకృతకవిత లలితశీతల స్తిమితమగు కాసారము

బిహారీరచనలో పల్లీపరిసరములే క్రీడారంగములు కావు, అతని కవిత రాజసౌధములుగూడ మెట్టినది. అధీరయువతులే నాయికలు గారు, మధుర బిబ్బోకలగు బిబ్బోకవతులుగూడ బిహారీ భావనలో దిరిగిపోయినారు. ప్రాకృతిక శృంగారమే కాదు, అమితమగు చమత్కారవిశేషములచే ఆస్వాద్యమానమగు నాగరిక శృంగారముగూడ సృష్టింపబడినది. స్వాభావికతనే యంటిపెట్టుకొనలేదు, అప్పుడప్పుడాయెల్లలు దాటి అచ్చమగు నాలంకారికతనుగూడ అగుపరచినాడు. అతడుగాథల ననుసరించిన కొన్ని పట్టులు చూడుడు :

"సహి సహిత్తితహతేణ
రామియాసుర అదువ్విఅద్ధేణ
పమ్మాఅసిరీసా ఇవ
జహాసే జాయాఇ అంగాఇ"

(సహతే సహత ఇతి తథా తేన రమితా పరతదుర్విదగ్ధేన, ప్రమ్లానశిరీషాణీవ యధాస్యా జాతాన్యంగాని.)

బిహారీ దోహా :

"యోదల మలియత నిరదయీ
దయీకుసుమ సే గాక్
కర్ ధర్ దేఖో ధర్ ధరా
అబౌనపురకో జాత్"

నాయిక చెలికత్తె నాయకునితో ననుచున్నది "ఓరి నిర్దయుడా కుసుమ సుకుమారమగు నీమెగాత్రమున నిష్కరుణముగా నలిపివేసితివి. ఈమె యెదపై చేయిపెట్టి చూడుము. ఆ గుండెదడ యింకను తగ్గనేలేదు."

గాథయందలి నాయిక సామాన్య, రతిచతుర, వక్త్రి. కుట్టిని, బిహారీ నాయిక ముగ్ధ. దయనీయురాలు 'సతసయి' యందు నాయికాంగములు పుష్ప సామాన్యములతో బోల్చబడినవి. గాథయందు కుసుమజాతి మూర్ధన్యములగు శిరీషములతో సామ్యము జెప్పబడినది. బిహారీ నాయికకు గలిగినది ఉర్ధఃకంపనము మాత్రమే! గాథానాయికకు సర్వాంగములు అలిసినవి ఉరఃకంపము భయాదులచేతను గలుగవచ్చును. ప్రాకృతమునందలి 'దుర్విదగ్ధ'శబ్దము అశేష వైదగ్ధ్యముతో గూడినది ఆ పలుకుబడి దోహావృత్తమున లేదు. అర్థశక్తిలో ప్రాకృతగాథ మించినది. కాని బిహారీ రచన మాత్రము శబ్దముల మిసమిసలతో గాథను వెక్కిరించుచునేయున్నది.

"జహజహ ఉవ్వహివహూ
నవజోవ్వణ మణమరాఇ అంగాఇ,
తహతహ సే తణు' యాయ ఇ
మఝోదయియో యపడివక్షో"

(యధా యథోద్వహతే వధూ
ర్నవ యౌవనమనోహరాణ్యంగాని
తథా తథాతస్యాస్తమాయతే,
మధ్యోదయితశ్చ ప్రతిపక్షః)

దోహావృత్తము :

"దేహదులహి యాకీ బఢై
జ్యాజా జో బనజోతి
త్యోత్యో లఖిసౌతే సబై
బదసమలిన దుతిహోతి"

ఈ ముద్దరాలి యొడలియందు యౌవనజ్యోతి వృద్ధిబొందు కొలదియు సవతుల మోములు నల్లవారుచున్నవి.

ఈ రెండును అలంకారపరములే! యౌవనజ్యోతి నాయికాంగములయందు ప్రసరించు కొలదియు సపత్నీముఖములు మలినములయ్యెననుటలో ఉల్లాసాలంకారము బిహారీ రచనమున స్పష్టముగా నున్నది. మూలగాథలో దయితుడును, సపత్నులును ఒకటేసారి కృశించి రనుటతో తుల్య, యోగితాలంకారము. యౌవన రూపకారణ మునకును, మధ్యకృశతారూప కార్యమునకును సమకాలికత్వముండుటచే అక్రమాతిశయోక్తి. ఈ రెండలంకారములచే మూలగాథలోని వాచ్యార్థము బలిసినది. ఆ స్వారస్యము బిరాహీలో గుదరలేదు. ఇతనిలో రీతిచిత్రమున్నది. అర్థపుష్టిలెదు. 'జోబనజోతి' అను పదములోని జ్యోతి మూలగాథలో లేదు

మూలగాథ :

"పున ఖణం ధువ ఇణం
పఫ్ఫోడ తఖ్ఖణం అఆణంతి
ముద్ధవహూ థనపట్టే
దిణ్ణంద ఇఏణ ణహరవఅమ్"

(ప్రోంఛతి క్షణం క్షాలయతి క్షణం ప్రస్ఫోటయతి తక్షణ మజావతీ, ముగ్ధవధూః స్తనపదే దత్తం దయితేన నఖరపదం.)

దోహావృత్తము :

"ఛినకు ఉఘారత, ఛినుఛువత
రాఖత ఛినకు ఛిపాయ్
సబుదిను పియఖండిత అధర
దరపన దేఖత జాయ్"

(ప్రియఖండితాధరమును దర్పణమున జూచుకొనుటతోనే దానికి దినమంతయు గడచుచున్నది. క్షణము చేతితో మూయుచున్నది. క్షణకాలము ముద్దుగొనుచున్నది. క్షణము చేయడ్డు దీసి చూచుకొనుచున్నది.

గాథయందు నాయిక ముగ్ధ, వ్రజనాయిక ప్రేమగర్వీత. మూలకారుడు స్తనమునందలి నఖరపదమును వర్ణించెను. బిహారి యధరక్షతమును వర్ణించెను. కాని వ్రజనాయికకు దినమంతయు దర్పణమునందు ప్రియఖండితమగు నధరమును చూచుటతోనే గతించెనట. ఇట్టి యర్థస్వారస్యము మూలమున లేదు.

మూలగాథ :

"నాయాఇ కింభణిజ్జ ఉ
కేత్తియ మేత్తంవ లిఖ్ఖఏ లేహే
తుహ విరహే జం దుఖ్ఖం
తస్స తుమంఛేయ గహియత్థో"

(వాచయా కింభణ్యతాం కియన్మాత్రంవా లిఖ్యతే, లేఖే, తవవిరహే యద్దుః ఖం తస్య త్వమేవ గృహీతార్థః)

**దోహావృత్తము :**

"కాగదపర్ లిఖత నబనై
కహత సదేస లజాత్,
కహిహయ్ సబ తేరోహియా
మేరే హియకీ బాతొ"

కన్నులకు నీ రడ్డు వచ్చును. కాగితముపై నా ప్రేమను దెలుపలేను. చెప్పలేను. లజ్జ యడ్డుదగులును. నీ హృదయమే నా హృదయమందలి ప్రేమనంతయు దెల్పును లెమ్ము.

ఇట్టి చోటులలో సాధారణముగ మూలమును, బిహారీ రచనయు సరికిసరిగా నడచును. రెంటిలోను నిట్టివేచాల గలవు. కాగా నేమి తేలినది? బిహారి మహాకవి కొన్ని చోటుల గాథల వలపించు కవితల నల్లెను. అరుదుగా కొన్ని చోటుల గాథలకే మెరుగులు దిద్దెను. కొన్నియెడల గాథల ననుకరింపబోయి యా సామాన్యత రాక తిరుగుడువడి పడెను. మొత్తముపైన బిహారిది రాజభోజనము. ఆ పదముల డాబు, శయ్యా వానియందే యాతని దృష్టి లగించినది. రీతియందు, శైలియందు సప్తశతియేగాదు. మరియే గ్రంథమును గూడ బిహారీతో పోటీకి నిలువలేదు. కాని ధ్వనిపుష్టిలో మాత్రము గాథలముందు 'సతసయి' లజ్జానమ్రవదనయై తల వ్రాల్చవలెనే కాని తప్పదు. ఇంతలో సప్తశతులను పేరితో గాథానుసరణములు ముగిసినవి. తరువాతగూడ 'సప్తశతీ' రచనము సాగినది. కాని రూపము మారినది. విషయము భేదించినది. ఈ మార్పును తీసికొనివచ్చినవాడు మహాభక్తపరుడు తులసీదాసు. అతని యమృతగ్రంథము రామసతసయి.

**రామసతసయి :**

ఈ గ్రంథమవధీభాషలో నున్నది. తులసీదాసును ప్రశంసించుటకు నాకు యోగ్యత చాలదు. మధుసూదన సరస్వతులవారి వాక్యము నుదాహరింతును :

"ఆనంద కాననే కశ్చి జ్జంగమస్తులసీతరుః,
కవితామంజరీ యస్యరామభ్రమర భూషితా"

అయిన నొక్కమాట మాత్ర మవశ్యము జెప్పుదును. సత్యమగు భారతీయ హృదయము తులసీరచనలలో చాలచోటుల ప్రతిఫలించినది. మానససరస్సువంటి యామహామహుని కవితలో లౌకికములగు లౌక్యములన్నియు నిశ్శేషముగ కరగిపోయినవి. ఆ భక్తిభావోన్మత్తుని కిన్నరగానము నేటికిని ప్రతిహిందువు హృదయాంతరాళమునందును నినదించుచున్నది. ప్రళయాంతము వఱకు నినదించునుగూడ! లలితములగు

వృత్తములు లలితతరములగు నాయంత్యప్రాసలు, వినుగింపని రూపకాలంకారములు తులసీదేవునకే తగును. అతని వాక్యములు మేధస్సునుండి బయలుదేరిన చిత్రవిచిత్ర కల్పనాలులితములకు సామాన్య భాషణములుగావు. యోగసాధనలదే. తపస్సుచే కరుడుగట్టి హృదయపు కొనయంచులనుండి మూర్తీభవించిన దివ్యజ్యోతులవలె విస్ఫురదాకారములతో ప్రపంచమును పావనము సేయుటకు ప్రభవించిన పుణ్యారాసులు. వారి సప్తశతీ గ్రంథమున భక్తిజ్ఞానములున్నవి. భక్తిజ్ఞానములును జోడించుకొన్న పవిత్రమగు సంసారము హృదయమున్నది. సాధకున కనుక్షణమును గలుగు విపరీతములగు ననుభవములలో నేది కర్తవ్యమో, మానవుడు భగవంతుడుగా మారుట యెటులో యీ సమస్యలను తులసీపుత్రు డద్దమున జూపినట్లు స్పష్టముగా నుపదేశించెను. ఆయన కనుభవమే శాస్త్రము. ప్రపంచమంతయు రామమయము. దాసభావముపాసనా పద్ధతి. ఆత్మానందము ఫలము. నైతిక ప్రవర్తన భక్తిపట్టణమునకు పరిఘయని యాతని తలపు. అందుచే సత్కర్మయుక్తమగు భక్తిని 'రామచరిత మానస' మందు వలెనే 'రామసప్తశతి' యందును గనుపఱచెను. అతని రచన అత్యంత విలక్షణము. భావములు విలక్షణతరములు ఆ భక్తి యోగకవిత లిట్టివి :

"కామ క్రోధమదలోభకీ
జౌలే మనమే ఖాన్
తౌలౌ పండిత మూరఖౌ
తులసీ యేక్ సమాన్"

(కామ, క్రోధ, మద, లోభములు ఎంతవరకును హృదయమునందుండునో అంతవఱకును పండితుడును, పామరుడును నొకటే.)

"తులసీ కాయా ఖేతహై
మనసా భయే కిసాన్
పాపపుణ్య దోవు బీజహై
బుబైసో లునై నిదాన్"

(తులసీ! శరీరమనునదే పొలము. హృదయమే కర్షకుడు. పాపపుణ్యము లనునవే రెండు బీజములు. ఎట్టి బీజము నాటిన నట్టి పంట యొదిగివచ్చును.)

మనజన్మము ధన్యమైనది. మనసుకళ్మల దూషితమగు నీ ప్రపంచమును క్షణకాలము మరచినది. అతని రచనలన్నియు నిట్టివే! ఇకముందు నడుతుము.

## రహీము సతసయి :

తులసీదాసు చూపిన యా మార్గమునే బట్టి నడచిన రెండవవాడు రహీమ్. అతని గ్రంథము రహీము సతసయి. అక్బరు సరదారులలో మేటియు, గుణపక్షపాతియు నగు బైరము ఖానున కితడు సుపుత్రుడు. సార్వభౌముని నవరత్నములను కవులలో

ప్రధానుడు భారతచక్రవర్తి కితనిపై అంతులేని గౌరవము. రహీము ఫారసీ, అరబ్బీ, సంస్కృతములను మర్మమెరిగి చదివెను. తులసీగురువుతో హృదయమును గలిపి చెలికారముజేసెను. యౌవనకాలముననే శృంగారరస ప్రధానములగు నలంకారగ్రంధములను రచించెను

(బరవై నాయికాభేద్, రాసపంచాధ్యాయి శృంగారసోరఠ్, మదనాష్టక్ అనునవి)

పండితాదరణశీలి! వితరణశాలి! దయాళుడు! మహాభిమాని! ("రహిమన్ బానీ రాకియే, విను బానీ సబుమాన్" (రహీమ్ మర్యాద నిలుపుకొమ్ము అదిలేని జీవితము శుష్కము) సజ్జనుడు ("ఖైర్ ఖూన్ ఖాసీఖుషీ బైరప్రీతిమధుపాన్, రహిమన్ దాబే నాదబై జానతసకలజహాన్" (దుర్గణముల జోలికి బోకుము. వానియందు దగిలిన వదలవు. ఈ సత్యమంద రెరిగినదే.) మహమ్మదీయుడైనను పవిత్రమగు హిందూ హృదయముతో కృష్ణపరమాత్మనారాధించెను. కాలమట్లే జరిగియున్నచో నీతడును బిహారి నందుకొని యుండెడువాడే కాని భగవంతుని తలపులు విచిత్రములు. వానిచేతల నెవ్వరు వ్యాఖ్యానింపగలవారు?

ఇంతలో నగ్బరు సార్వభౌముడు గతించెను. జహంగీరు చక్రవర్తి రాజద్రోహము క్రింద రహీమును ఖైదు చేసెను. పాపము, రహీము ఆ కటికచీకటిలో దురంతవ్యధల ననుభవించెను. కడకదియు మేలేయైనది. దానితో నాతని హృదయము సౌందర్య ముగ్ధము మాత్రమేకాక గంభీరముగూడనైనది. భావములు లలితములేకాక యూడలు దిగి పరీక్షా వహములైనవి జీవితమే నూతనానుభూతులతో పొంగిపొరలినది. ఆ కృష్ణపరమాత్మ చీకటిగుహలో సిలుగుల మధ్య చల్లని నవ్వులతో సాక్షాత్కరించి తెల్లనిచూపుల నాశీర్వదించెనేమో! ఒక మధుర పరిణామముకొరకే యందు జేర్చునేమో! ఎవ్వరెరుగుదుః!

కడకెటులో తపనకొని బయటపడినాడు. ఇంతకుముందు ముప్పొద్దు తన్ను బరివేష్టించియుండి పొగడిన మిత్రులు దూరీకరించినారు. బంధువులరకంట జూచినారు.

("రహిమన్ నిజసంపతి బినా,
కో ఉ న బిపతి సహాయ్,
బిను పానీ జ్యౌజలజకో,
నహి రబి సకై బచాయ్"

రహీమూ! సంపత్తు వదలినతరువాత నొక్కరును సహాయము చేయరు. కమలినికి సూర్యుడెంతహితుడైనను, సరసు నీరింకినతరువాత నామె నతడు రక్షింపడు.)

సంపదయందలి చంచలత యనుభూతమైనది.

("కమలాథిర్ న రహిము కహి,
యహ జానత సబ్కోయ్,

పురుషపురాతనకీ వధూ
క్యో న చంచలా హోయ్"

రహీమూ! సంపద స్థిరముగాదు. ఇది సృష్టియంతయు నెరిగిన రహస్యము. పురుషుడగు విష్ణువు పురాతనుడు. ఆమె నవవధువు. ఏల చంచల కాదు?)

ప్రపంచమునందలి డంబములు - అసత్యములు సహస్రవేషములతో ప్రత్యక్షమైనవి.

("అబ్ రహీము ముసికిలపరీ,
గాఢే దో ఊ కామ్,
సాంచేసేతో జగనహీ.
ఝూటే మిలే న రామ్"

ఇపుడు రహీముని రెండు పనులునుజెడినవి. చాల కష్టమున బడినాడు. అసత్యము లాడకున్న జగమున బ్రదుకలేడు. అసత్యముతో రాముడు దొరకడు.)

అనంతమగు ప్రకృతిదప్ప తన మొరను విను మానవ మాత్రుడే లేడు మానవజాతిపై మహాగ్రహము ప్రబలినది.

("నాద రీఝు తస్ దేతమృగ,
నరధనహేతసమేత్
తేరమీము పశుతే అధిక,
రీఝేకఛూనదేత్"

మృగములు నాదమునకు వలచి ప్రాణముల నొసగుచున్నవి, నరుడు స్వార్థమునకై ధనము నొసగును. స్వార్థరహితముగా ధనము నివ్వడు. ఒకదానిని ప్రేమింపడు ఇట్టివాడు పశువుకన్న గొప్పవాడు.)

కడకు ప్రపంచమే క్షుద్రమని తీర్మానించుకొన్నాడు. ఈ విపరీత సంఘర్షణములచ్చే కలిగి మానవుల సంబంధమునే వదలుకొని చిత్రకూటమును జేరి సామాన్యునివలె కాలమును గడపినాడు. ఏకాంతమున భగవంతునికై విలపించినాడు.

నిరాశాహతమగు నా హృదయకుండమునుండి, నిశ్వాసానలధూసరితమగు నా కలము నుండి గ్రహములు వక్రించిన యాయశుభభవిష్యరసమయమున రహీము సతసయి తిన్నగా కోడెత్రాచువలె పడగనెత్తి యాడినది. దైన్యము, ఘృణత, నిరాశలోని యాశ ప్రతివృత్తమునను ప్రతిఫలించినవి.

పవిత్ర జీవితముపై ప్రేమ హెచ్చినది. దానికై తాను యత్నించినాడు ప్రపంచమును ప్రబోధించినాడు. శాంతిలేక యల్లాడు నాత్మగాథను కూడ విసిగిన చిత్తముతో గద్గదగానము చేసినాడు.

"సర సూఖే పంఛీ ఉడై
ఔరేసర న సమాహి
దీన మీన బిన పచ్ఛ కే
కహు రహీము కహ జాహజ"

(సరస్సు ఎండిపోయినది. ఱెక్కలుగల జలపక్షులు వేరు సరస్సునకు బోగలవు కాని, పక్షములు లేని దినమీదినము ఎటు బోగలదు? రహీమూ! నీవే తెలుపుము)

"రహిమన విదాతూ భలీ
జో ధోరేదినహోయ,
హిత అనహిత యా జగతమే
జానిపరత సబ కోయ"

(రహీమ్! దుఃఖములు శాశ్వతములు కావు. అవి కొద్ది దినములే యుండును కాని ప్రపంచమునందు కర్తవ్యాకర్తవ్యములే శాశ్వతములు. అందరకును తెలియును.)

చింతచే చీకి చివికి శల్యావశిష్టుడై రహీము గతించినవాడు. కావ్యము మాత్రము నాటికిని, నేటికిని రుద్ధకంఠమున పవిత్ర హృదయమున ప్రపంచము నుద్బోధించుచునే యున్నది.

'రహీముసతసయి'యందు ప్రతివృత్తమునను అతని నామాంకిత ముండును. తులసీదాసు గూడ నీ మార్గమును యనుసరించెను. కాని దానినంత నియతముగ నిర్వహింపలేదు.

వీని తరువాత సంస్కృతమునగాని దేశభాషలలో గాని సప్తశతీ గ్రంథములు కానబడుటలేదు. మనవారి సంప్రదాయమును బట్టి చూడ నీయలవాటింతటితోనే యంతరించియుండదు. ఈ జాతినే కొన్ని గ్రంథములు ఎక్కడనో, గడ్డకుగ 'క చీకటి కొట్టులలో తాళపత్రములలో బడియుండును. అట్టి సప్తశతులను ముక్తకకావ్యములను అన్నిటిని వెదకి గడ్డకు దేవలయును. ఆపని చేయుట కర్హులు నాకన్న గొప్పవారు - పండితులు, పరిశోధకులు. వారి సేవను జూచి సంతోషించు సహృదయత మాత్రమే నాది. అంతకుమించిన యోగ్యతలేదు.

(ఈ వ్యాసమునకు గొన్ని యాధారములు భట్ట శ్రీమథురానాథశాస్త్రి గారి పీఠికనుండి గ్రహించితిని. ఇందుకై వారికి గృతజ్ఞుడను.)

*(భారతి, జనవరి - ఫిబ్రవరి 1942)*

# సంస్కృత నాటకాలలోని ప్రాకృతం

భగవంతుడైన పతంజలి మహాభాష్యమునందు 'సుశబ్ద' విచారమును గావించుచు 'అపభ్రంశ'శబ్దమును ప్రయోగించియున్నాడు. (భయాంసో అపశబ్దాః, అల్పీయాం సశ్శబ్దాః ఏకైక స్యహిశబ్దస్య బహవో పభ్రంశాః తద్యథా, గౌరిత్యస్య శబ్దస్య 'గావీ' 'గోణీ' 'గోతా' 'గోపోతలికా ఇత్యేవ మాదయో అపభ్రంశాః .(మహాభాష్యము) ఆ సందర్భముననే 'అపశబ్ద' అనెడు మాటయు వాడబడియున్నది. ఈ రెండు పదములను బోల్చి చూచినప్పుడు భగవానుడు వాడిన 'యపభ్రంశ'పదము - కేవలము అసంస్కృతమైన మాట నుద్దేశించి వాడబడినట్లే తోచుట సహజము. కాని కొంత నిదానముగ నిలచి చూచినచో వారు వాడిన శబ్దము సాంకేతికము. 'గో' శబ్దమునకు భగవానుడొసగిన రూపాంతరము లన్నియు ప్రయోగములందుగనపడును. 'ఖరీణియా ఓ గావీవో' 'గోణంకియాలం' (ఆచారాంగే) 'గావీయే పుణదిణ్ణంతనంపి ఖరిత్తణము వేయి' (అవశ్యకచూర్ణ) 'గోణీణం సంగెల్లం' (వ్యవహారసూత్ర) 'వచ్ఛగగోణీఖుజ్జా' 'గోనీ చందనకంధా' (అవశ్యకచూర్ణ) 'ఎత్థం గోణీ యేదిత్థంతో' అప్పణహు ఆవుగోణీ, గోణీసరిచ్ఛేయగురూ (దశవైవాలికవృత్తి) అనగా 'మహాభాష్య' కాలము నాటికే ప్రాకృతభాషలు బాగుగా యెదిగి రెమ్మలు దించినవి.

'ప్రాకృతము'లను మాటలో ప్రాచీనులు వేని వేనిని వింగడించికొనిరో చెప్పుట చాల కష్టము. అట్లే 'అపభ్రంశ' శబ్దమునకు గూడ వా రొసగిన వ్యాఖ్యలు ఒక తీరుగా లేవు. కావ్యాదర్శమునందు దండి "కావ్య విషయము నందు అభీరాది భాషలు అపభ్రంశములగు"నన్నాడు. శాస్త్రమునకు వచ్చువేళకు సంస్కృత భిన్నములై భాషలన్నియు 'అపభ్రంశములేనట! (అభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతి స్మృతాః, శాస్త్రేతు సంస్కృతాదన్యదపభ్రంశ తయోదితం (కావ్యాదర్శముదండి)) ఈతడెన్నుకొన్న 'అభీరాది' భాషలేవో! ఇంతకంటెను రెండాకులెక్కువ చదివిన యాతడు నిమిసాధువు. 'అపభ్రంశము'లనగా ప్రాకృతమేనని ఉన్నవి లేనివి కలిపి యాతడు ఒక పదముతో తేల్చివేసి తన పని సులువు చేసికొనెను. ("ప్రాకతమేవా ఽ పభ్రంశః" (రుద్రటుని కావ్యాలంకార టిప్పణి)) నిమిసాధువు అభిప్రాయము ననుసరించి, 'శౌరసేన్యా'ది భాషల కన్నిటికిని 'ప్రాకృత' మనునది 'సామాన్య' నామము. ఆతడు వాని భిన్నమైన యస్తిత్వముచే యంగీకరింపడు! ప్రాకృతమే 'కించిద్విశేష లక్షణముతో 'మాగధి' యగునట. అదియే కించిద్విశేషము'తో 'పైశాచి', ఆ ప్రాకృతమే 'కించిద్విశేషము'తో 'శౌరసేని'యు, 'అపభ్రంశము' గూడ నగును. (పాణిన్యాది వ్యాకరణోదిత శబ్దలక్షణేన సంస్కరణాచ్చ సంస్కృతముచ్యతే, తథీ ప్రాకృతభాషైన కించిద్విశేష లక్షణాత్ మాగధికాభణ్యతే. తథా ప్రాకృతమేవకించిద్విశేషాత్పైశాచికం, శౌరసేన్యపి ప్రాకృతభాషైవ, తథా ప్రాకృత మేవాపభ్రంశః (కావ్యాలంకార టిప్పణి) అతని పాలిటికి 'కింద్విశేష' పదము కల్పవృక్షము. దీనిలో ప్రపంచమున దేనికైనను సులభముగ లక్షణము దేల్చి

వేయవచ్చును. ఈ 'నిమిసాధువు' వచించిన లక్షణమెంత యన్యాయముగ గనపడుచున్నను అతని పంథా ననుసరించిన యాలంకారికులును తక్కువమంది లేరు అందుకే ప్రాకృతములనుట తోడనే 'మహారాష్ట్రి'కి మాత్రము కొంత విపుల చర్చచేసి, తక్కినవన్నియు నింతే పొమ్మనుట వైయాకరణుల కొక యలవాటైనది. వీరికన్నను మరికొంత మెరుగైనవారు కొందఱు వారపభ్రంశమునకు మాత్రము ఒక ప్రత్యేకత నంగీకరించిరి. ఆ ఉదారతయు దొలుత 'దండి'దే యనిపించును. (శబ్దార్థౌసహితౌ కావ్యం గద్యం పద్యంచ తద్విధా! సంస్కృతం ప్రాకృతం చాన్యదపభ్రంశ మితి త్రిధా. (కావ్యాదర్శము) 'విష్ణు ధర్మోత్తరకారుడు మాత్రము సంస్కృత ప్రాకృతములను రెండుగా వింగడించి, 'అపభ్రంశ' మనంత మని విశాలదృష్టి నగుపరచెను (సంస్కృతం ప్రాకృబూతంచైవ గీతం ద్వివిధ ముచ్యతే, అపభ్రంశం తృతీయంచ తదనంతం నరాధిప! (విష్ణుధర్మోత్తరే) ఇంతకును 'ప్రాకృతము'లని పిల్వబడెడు భాషలెన్ని? వానికేమైన మితియున్నదా? లేక 'విష్ణుధర్మోత్తర' కారుడన్నట్లు 'అనంతము'లేనా!

ప్రాకృత లక్షణమునందు భాష లాఱన్నాడు. (సంస్కృతం ప్రాకృతంచైవా ఽపభ్రంశః పిశాచినీ మాగధీ శౌరసేనీచ షడ్భాషాశ్చ ప్రకీర్తితాః (ప్రాకృతలక్షణే) అవి సంస్కృత ప్రాకృతములు, అపభ్రంశ పైశాచీ శౌరసేన మాగధులు. మఱి యాతని దృష్టిలో 'అర్థమాగధీ, చూళికా' మొదలైన వేవి కావలెను? వానికి 'ప్రత్యేక యోగ్యత' నితడంగీకరింపలేదా? ప్రాకృత లక్షణకారుడు వాడిన 'ప్రాకృత'మనెడు పదమే భాషలను సూచించును? ఏమో! చెప్పలేము. (మాగధ్యవంతిజా ప్రాచ్యా శూరసే న్యర్థమాగధీ వాహ్లికా దాక్షిణాత్యాశ్చ సప్తభాషాః ప్రకీర్తితాః (నాట్యశాస్త్రము) నాట్యశాస్త్రమునందు ప్రాకృత భాషలు ఏడని చెప్పబడినది. పై లక్షణమునందు చోటు దొరకక అలపరించిన 'అర్థమాగధి' యిందులో 'నేనున్నా' నన్నది. (అత్థారసదేశీ భాసావిశారయా, సింగారాకార చారువేసా, గీయరయీ, గంధవ్వణట్టకుసలా (అనుయోగద్వారసూత్ర) మఱికొందఱు ప్రాకృత భాషలు పదునెనిమిది యన్నారు. కువలయమాలా కధాకారుడు ప్రాకృతములు పదునెనిమిదింటిని చూచాయగా జూపుటకు బ్రయత్నించెను. నాటి యాంధ్రదేశము నందును, కర్ణాటకమునందు గూడ 'దేశిబేధము'లుండెనట! ఆయాదేశ జనుల స్వభావాకారములను గూడ చిత్రించుట కతడు ప్రయత్నించుట చాల హర్షింపదగిన విషయము. (ఉక్కటదప్పా, పియమోహణే, పయరోద్దే, పయంగవిత్తీయ 'అద్రిపోండి, మనరే' భణిరూపిచ్ఛయి కణ్ణాయియే అణ్ణే – పియమహిళా సంగామే, సుందరగత్తే, యభోఇణీరోద్దే 'అటిపుటిరటిం' భణంతే -- అంధ్రే కుమారో పలోయియే (కువలయమాలా గాథాయాం) కాని యింత లెక్కపెట్టినను ఆ భాషలు ముగియలేదు. అందుకే యింకను 'పారినబర్బరాదు' లనేకములు గలవన్నాడు ('అణ్ణాయియపులయే యీ కసపారిసబబ్బరాయీయే' (కువలయమాలాగాథ) ఇంతకు నేమైనది! ఇతడును 'విష్ణు ధర్మోత్తర కారు'ని వరుసకే వచ్చినాడు. వీరందరి కంటె నీ సత్యమును చక్కగా గమనించి, మంచి సన్నివేశమున బొదిగినవాడు శూద్రకుడు. 'మృచ్ఛకటిక'లోని

చందనకుడి మాటలనును 'అరే! కో అప్పచ్చ ఓతుహా! వపుందక్షిణత్థా' అన్వంత భాసిణో, ఖస, ఖత్తి, ఖడ, ఖయిరే, విలయ కణ్ణాట, కణ్ణప్పా వరణయ, ద్రవిడ, చోళ, చీణ, బర్బర, ఖేరభావముఖ మధుఘాత ప్రభృతీనాం మ్లేచ్ఛ జాతీనాం, అనేక దేశభాషాభిజ్ఞా, యధేష్టం మంత్రయామో, దిర్తో, దిర్తావా, అజ్జో, అజ్జీయావా, కింశబ్ద విచారః స్త్రీ పుం నపుంసక వ్యాఖ్యాన మప్రస్తుతం" ముద్రారాక్షసములోని విశాఖదత్తుడు గూడ 'ప్రయుక్తాశ్చ స్వపక్ష పరపక్షయోః అనురక్తా పరక్త జనజిజ్ఞాసయా, బహువిధ దేశ వేష భాషాచార సంచార వేదినోనానాప్యంజనా! ప్రణిధయః' అని వచించెను. కనుక ప్రాకృతభాషా సముద్రమొక మహాయమృత సముద్రము దానిలోజేరున వెన్నియో పీయుష ప్రవంతికలు

సంస్కృతాభిమానులు ప్రాకృతముల ప్రాచీనతను గూడ విశంకించిరి. వారికున్నదొకటే దృష్టి - ఏవిధముగనైనను గీర్వాణమునకు మరియాద నిలుపవలెను. ఈ పట్టుదలలో వారు 'సంస్కృతమే' ప్రకృతియనియు, దానినుండి చెడి చెటాకులైనది 'ప్రాకృత'మనియు చెప్పి ముగించివేసినారు ('ప్రకృతే స్సంస్కృతాయాస్తు వికృతిః ప్రాకృతీ మతా' (రూపకపరిభాష) ఆ సంస్కృత భవమైన ప్రాకృతము, సిద్ధసాధ్యభేదములతో (తద్భవా సంస్కృతభవా సిద్ధసాధ్యేతి సా ద్విధా (షడ్భాషాచంద్రిక) ద్వివిధమట! తానెంత ప్రయత్నించినను ప్రాకృతము సంస్కృతమును బోలదట! కారణమేమనగా - గీర్వాణము దేవతలు మాటాడు భాషయని యెన్నడో తేలిపోయినది ('సంస్కృతం స్వర్గిణాం భాషాశబ్ద శాస్త్రేషు నిశ్చితా' (కావ్యాలంకారము) ఈ యభినివేశము పెరిగి పెరిగి యెంతవరకు వచ్చినదనగా 'గాథాసప్తశతి'కి నకళ్ళు సంస్కృతమున దయారైనవి. గోవర్ధనాచార్యుని కలముచాల సరసమైనది అతండు మరి దేనికైనను వ్రాసియుండినచో బాగుండెడిది. ఇపుడాతని వ్యక్తిత్వము ప్రాకృతకవులకు 'ఛాయామాత్రము'గనే నిలచిపోయినది.

ప్రాకృతాభిమానుల యభినివేశము గూడ 'సంస్కృతవాదు'ల కేమాత్రమును దీసిపోవునదిగాదు. వారు రెండింతలుగ గీర్వాణము నాక్షేపించినారు. 'వజ్జలగ్గ'లో నీచాటు వున్నది.

"లలియే మహురక్ఖరయే
జువఈజణ వల్లహేస సింగారే
సంతేపాయియకవ్వే
కోసక్కయి సక్కయంపడిపుం"
(లలితే మధురాక్షరే యువతీజనవల్లభే స శృంగారే
సతి ప్రాకృతకావ్యే కశ్శక్నోతి సంస్కృతం పఠితుం!)

లలితమై, మధురాక్షరమై, శృంగారమై, యువతీ జనవల్లభమైన ప్రాకృతముండగా సంస్కృతము నెవ్వడు చదువునని యా కవివేయు ప్రశ్న. "ప్రాకృత భాషా

వివేచనములేనివానికి పువ్వువిల్తు శాస్త్రమర్మమును వివరించుటకు సిగ్గులేదా?"యని హాలుండడుగును. (అమియం పాయియకవ్వం, పఢి ఉం, సోఉం వజేణ జాణంతి కామస్సతత్తతంతిం కుణంతి తేకహంణలజ్జంతి! (గాథాసప్తశతి)

సంస్కృతమునుండి ప్రాకృతము పుట్టినదనుటయు వీరంగీకరింపలేదు. పైగా సంస్కృతమే ప్రాకృతజన్య మని వీరి వాదము. ఈ ఘంట మ్రోగించినవారిలో ముఖ్యుడు యాయాకరుడైన రాజశేఖరుడుగా గనపడును. (యద్యోనిః కిల సంస్కృతస్య సుదృశాం జిహ్వాసుయన్మోదతే యత్ర శ్రోత్ర ప్రధా ఽ వతారిణీ కటుర్భాషాక్షరాణాం రసః (బాలరామాయణ నాటకం) సంస్కృతము దేవతల భాషయనుటయు వీరికి సమ్మతముగాదు. అమరులు అర్ధమాగధీభాషలో ప్రసంగింతురట! మహావీరుని శిష్యులలో నొకడు "ధర్మబోధ కేభాష తగినది? దేవతలే వాఙ్మయమున బ్రసంగింతు"రని మహావీరునడిగెనట. ఆ సంభాషణము చూడుడు.

దేవాణాం భంతే!
కయరాయే భాసాయేభాసంతి? కయరావా
భాసా భసిజ్జమాణీ విసిస్సఇ?
"మహా"గోయమ! దేవాణం
అర్ధమాగహాయే భాసాయే భాసంతి
సావియణం, అద్ధమాగహీభాసా,
భసిజ్జమాణీ విసిస్సయి."
(దేవానసుభగహ! కతరాయాం భాషాయాం భాషంతే?
కతరావా భాషా భాష్యమాణా విశేష్యతే?
గౌతమ! దేవాఃకిలీర్ధమాగోధ్యాం భాషాయాం భాషంతే,
సాఽపిచ కిలాఽర్ధమాగధి భాషా భాష్యమాణా విశిష్యతే.)

కేవలము దేవతల యూసెత్తుటతో మాత్రమాతడు తృప్తిపడలేదు మరల గౌతముడ డిగినాడు.

'సేకింతంభాసారియా?'
"భాసారియాజేణం
అద్ధమాగహాయే భాసాయే భాసంతి,
జత్థవియబంభీలివీ సవత్తయి"
('కథంకేతే భాసార్యాః? భాషార్యాయే కిలార్ధమాగధ్యాం భాషాయాం భాషంతే, యత్రాయపిచ బ్రాహ్మీలిపిః ప్రవర్తతే (అవశ్యకసూత్రే)

పై సంభాషణానుసారము అర్ధమాగధి రానివానికి ఆర్యుడనిపించుకొనుటకే వీలులేదు. గీర్వాణ బహిష్కారముతోపాటు ఆ లిపికూడ మహావీరునికి పనికిరాదు.

బ్రాహ్మీలిపియే అదరణీయమన్నాడు. పై యభిప్రాయమునే నిమిసాధుగూడ బలపరచుచున్నాడు. ('అరిసవయణేసిద్ధం దేవాణం అద్ధమాగహీవాణీ' (రుద్రటునికి టిప్పణి) ఈ పట్టుదల యెంతవరకు వచ్చినదనగా, మహావీరుని యనంతర మెవడో యొక యాచార్యుడు జైనధర్మమును సంస్కృతమున బోధించుటకు దొరకొనగా తక్కిన శిష్యులాతని బలవంతముగ పట్టి ప్రాయశ్చిత్తము బెట్టినారు. కువలయమాలా కథాకారుడు సంస్కృతము 'దుర్జన హృదయము'వంటిదన్నాడు. (అనేక పదసమాస నిపాతోపసర్గ విభక్తిలింగ పరికల్పనాకువికల్ప సంగదుర్గమం దుర్జనహృదయ మివ విషమం')

ఈ రీతిగా సంస్కృతము దేవభాషయనెడు వాదమునకు ప్రాకృత కవులును, లక్షణకారులును దెబ్బకొట్టిరి. కొందఱిమతము ననుసరించి "అర్థమాగధి" దేవతభాష. మరికొందఱు అపభ్రంశమన్నారు. 'శివానుచరులు' పైశాచి భాషింతురని యొక భేదమును చీలదీసినారు. వేఱు కొందఱు 'మాగధీ' భాషయే నికరముగ దేవతలు భాషించునదని తేల్చి చెప్పిరి. 'పాలీ' దేవభాషయన్న వారును లేకపోలేదు. ఇంతకు దేవత లేమి మాటాడుదురో - మాటాడుదురో లేదో - వారు వ్రాయునది దేవనాగరలిపియో, చూచివచ్చినవాడెవ్వడును లేడు కాని యీ పండితులందఱు చేరి స్వర్గలోకమున పెద్దయల్ల కల్లోలమును లేపినమాట మాత్రము వాస్తవము. అక్కడనే కాదు భూలోకమున గూడ అలజడినే లేపిరి. ఒక విషయమున నిన్ని వాదములైనచో దేనిని నమ్ముట! దేనిని వదలుట!

ప్రాకృతమును ప్రేమించినవారిలో ననేకములు తెగలున్నవి. కొందఱు పెద్దమనుష్యులు వారి దృష్టి కేవలము రసైకాశ్రయము - "భాషయేదైన మాకేమి! కవిత్వమనగా ఉక్తివిశేషమేగదా! అది యెవనియందు గాఢముగ నున్నదో వానిని చదివి యానందింతు" మని వీరి వాదము. (అత్థణి వేసో తచ్ఛియ, సద్దాతచ్చేవ, పరిణమంతావి ఉత్తివిసేవపో కవ్వో భాసాజాహోదు, సాహోదు ----) సంస్కృతమును ఆదరించినవారిలో గూడనిట్టి యుదార హృదయమును వెల్వరించినవారు గలరు. అట్టివారిలో 'దండి' యొక్కడు. ('మహారాష్ట్ర శ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః సాగర స్సూక్తిరత్నానాం సేతుబంధాదియన్మయమ్' (కావ్యాదర్శము) గీర్వాణముపై నాతనికెంత యభిమానమున్నను సేతుబంధములోని గాంభీర్య లాలిత్యముల గమనించినపుడు ఆ రసికుని హృదయము 'రింగు'మని మ్రోగినది. అతడాభాషకు 'సర్టిఫికెట్టు'నివ్వక తప్పినది గాదు. ఈ దేవ భాషాభిమానులలో మరియొక చిత్రమైన తెగయున్నది. వారి దృష్టిలో సంస్కృతమునకు అనంతయవమానము జరగుట యిష్టములేదు. కాని 'ప్రాకృతము' నందు మాధుర్యము కలదని వారి హృదయములు పల్కుచున్నవి. వారి విమర్శనముల గమనింపక సామాన్యజనములు ప్రాకృతముల బ్రేమించుచున్నారు. దీనిని గమనించి వారొక యెత్తు నెత్తిరి. సంస్కృత కావ్యములు మహాగంభీరములై సామాన్యుల కర్థముగావట! అందుచే పాండిత్య లబ్ధిలేని స్త్రీ

బాలాదులు ఆనందించుటకు ప్రాకృత కావ్యములు పనికి వచ్చునట! (బాలస్త్ర్యాది జడప్రాయ భవ్యజంతు హితేచ్ఛయా ప్రాకృతా ఽఽ గమకర్త్రుభ్యోగణకృద్భ్యోనమోనమః (ప్రాకృతద్వ్యాశ్రయవృత్తి) సవ్వాణవిసుహబోహం, తీణీమంపాయి యంరయియం గూడత్థదేశివహియం, సులలితవణ్ణేహి, నిర్ణయియం, రమ్మం పాయియకవ్వంలోయే - కస్సవహి ·ను యంసుహావేమి! (పంచమీ మాహాత్మ్యం) ఈ వాదమున గొంత నిజమును నుండవచ్చును. కారణమేమనగా యెవరెటులన్నను చాల ప్రాచీనకాలముననే ప్రాకృతములు వ్యావహారిక భాషలు. వ్యావహారికములన్నప్పుడు వానికి దగిన మార్పులు చేర్పులు నుండుటః సహజము. వ్యాకర్తలకు వానిపై నూటికి నూఱుపాళ్ళధికారముండదు. అందుచే దానియందు భావోద్ఘాటనము గొంత సుగమమై యుండును. ఈ విషయమును మనస్సున నుంచుకొనియే కాబోలు కువలయమాలా కథయందు ఈ సంవాద మారంభమగుచున్నది. ఒకతె మగని నేదైన కథ జెప్పుమని యడిగినది. ('తాకింసి పయోసవిణోయమేత్తసుహయం, మణహరుల్లావం సాహేహ అవువ్వకహం, మహిలాయణమనోజ్ఞం''ఉవలబ్భయిజేణ పుడంఅత్థో, అకయత్థియేణహియయేణ)"ఏ భాషయందు వచింపు మండఃవు? సంస్కృతమున జెప్పనా! ఆ భాష లక్షణయుక్తమై, శ్రవణపేయమై· యుండునుగదా!" అని భర్త వేసిన యెదురు ప్రశ్న, ఆ బయకారి వెంటనే తల నడ్డమాడించినది. ఆమె యిట్లు బదులు పల్కెను. "మీ లక్షణమే యేట బోయిన మాకేమి! మేము స్త్రీలము,.మా హృదయములు లలితపేశలములు. అందుచే బుద్ధిని క్లేశపెట్టక విన్నవెంటనే స్ఫుటముగా నర్థమగుభాష మాకు గావలెను. (సోచేయపరోసద్ధో, ఇత్థో, కిం లచ్ఛణేణమ్హ') కనుక మనోల్లాసకరమైన కథను మహిళాజన మనోజ్ఞమగు భాషలో జెప్పుము" అన్నది.

సంస్కృతము నాదరించిన కవులు, లక్షణకారులు మొదలైన వారిలోను ప్రాకృతమున పక్షపాతమును చూపినవారనేకులు. అది 'ప్రియావక్త్రేందు సుందరమట! ఈ తెగవారిలో యాయావరుడైన రాజశేఖరుడు మహావీరుడుగా గనపడుసు. గీర్వాణ కవిత్వము నందు అతని కలము సామాన్యమైనది గాదు. లోకము మహాకవులుగా నాదరించుచున్న యెన్ని రచనలకంటెనో రాజశేఖరుని వాక్కు గంభీరమైనది. సుందరమైనది అతడు అవసరము వచ్చినపుడంతయు ప్రాకృతములను బొగడును.

సంస్కృత ప్రాకృతములకు స్త్రీ పురుషుల కున్నంత భేదము ('పరుసోసక్కియబంధో, పాయియబంధో వి హోయిసుయుమారో పురిసాణం, మహిలాణం, జెతియమిహంతరం తేత్తియమిమాణం'(రాజశేఖర) గలదట. పురుషుని మనఃప్రవృత్తివలెనే సంస్కృతబంధము పరుషమైనది. సంస్కృతమున శోభను గల్పింపవలెనన్నచో కవి చాల శ్రమపడి గ్రంథమున సౌభాగ్యమును సమకూర్చవలెను. ప్రాకృతమున నీ కష్టములేదు దాని యందము స్వభావసిద్ధమైనది ('గిరశ్శ్రవ్యాదివ్యాః ప్రకృతిమధరాః ప్రాకృతధురః సుభవ్యో ఽ పభ్రంశ స్సరచనం భూతవచనం (రాజశేఖర, బాలరామాయణం) ప్రాకృతరచనము చెవిని బడినదా! ఇక సంస్కృత రచనలకు ఆ చెవియందు స్థానము దొరకదట!

('యత్రశ్రోత్రపథా ౽ వతారిణి కటుర్భాషా ౽ క్షరాణాం రసః (బాలరామాయణం) ఇది యతని వరుస, రాజశేఖరుడు రాజులకొక విద్యాసభ నేర్పాటుచేసినాడు అందునను ప్రాకృతములకే యతడు పెద్దపీటకమును గట్టెను. సభయందు రాజు మధ్యలో గూర్చొనవలెనట! ఆతని కుత్తరమున సంస్కృత విద్వాంసులు, కుడివైపు ప్రాకృత భాషాకవులు, దక్షిణమున భూతభాషా కవులు, పశ్చిమమున నపభ్రంశ భాషా రచయితలు అధివసింపవలెను ('తస్యాంరాజాసనం, తస్యచోత్తరతః సంస్కృతా కవయో నివేశేర పూర్వేణ ప్రాకృతాః కవయః, పశ్చిమేనా ౽ పభ్రంశివః కవయః, దక్షిణతో భూతభాషా కవయ స్తతః పరంభుజంగగణికాః (కావ్యమీమాంస) ఈ విංగడింపున కాతని కాధారమేమో! పూర్వదిక్కు ప్రాకృతభాషకు నియమించుటలో, ఆ వాక్కుపై నాతనికి గల 'యరుళే' ప్రధాన కారణమని భావింతును. ఇంతకును 'అవంతి సుందరి' అదృష్టవంతురాలు. ప్రాకృతము స్త్రీల భాషకదా! ఆమె ప్రేమ సంపూర్ణముగ రాజశేఖరుని చిత్తవృత్తినే మార్చివేసినది యాయా వరుడును అదృష్టవంతుడే. ధీరలలితుడైన వానికి ఇహలోకమునందు ప్రణయినీ విధేయుడై యుండుటకంటెను వేఱు భాగ్యమేమి కావలెను? రాజశేఖరుని వంటివాడే కామసూత్రకారుడుగూడ ఆతడు దంపతుల కొక చక్కని యవకాశమిచ్చినాడు. తామెంత సంస్కృత విద్వాంసులైనను ప్రియా ప్రసంగములందు మాత్రము గీర్వాణము వాడువాడు అరసికుడట.! ('సురతే కర్ణమూలేషు యచ్చదేశీయభాషయా, దంపత్యోర్జల్పితం మందం మన్మనంతద్విదుర్బుధాః (కామసూత్రే)

ఇక ప్రాకృత కవులు గీర్వాణమున చేసిన గేలి అంతింత యనరాదు. సంస్కృతము దుర్విదగ్ధ హృదయములందు మాత్రమే యుండునని కొందఱు, ఈ తెగవారిలో 'వజ్జలగ్గ'లోని కవులు మహా చతురులు 'వజ్జలగ్గ' 'గాథాసప్తశతి' వలెనే యొక సంకలిత గ్రంథము. కాని మన దురదృష్టవశమున ఆ కవులలో నొకరి పేరును మనకు తెలియదు. వారు కేవల కీర్తికాయులు మన కోవెలలు కట్టిన శిల్పులవలె, అందులో ఒక రచయిత యన్నాడుగదా! ప్రాకృతమున ప్రసంగించినపుడు సంస్కృతమున బదులొసగువాడు మూర్ఖుడు (పాయియకవ్వుల్లావే పడివయణంఫక్కి యేణజోదేయి సోకుసుమనత్థరం, పత్థరేణ అబుహో వినాసేయి -(వజ్జలగ, జయవల్లభ) వాడు కుసుమ ప్రస్తరమును ప్రస్తరముతో భేదించువాడు. వేఱొకకవి 'ప్రాకృత కావ్యమాత్రమునకు నమస్కరించుట! (పాయియ కవ్వస్సణమో, పాయియకవ్వం చణిమ్మియంజేణ తాహం చియపణమామో, పడి ఊణయజేవిజాణంతి (వజ్జలగ్గ) ఇకనా భాషా రచయితలను గుఱించి వేరుచెప్పనేమున్నది? అంతేకాదు ప్రాకృత కవిత్వమును చదువువారికి కూడ ఆ కవి నమస్కారమును సమర్పించుచున్నాడు. మఱియొక యావేశి సంస్కృత కావ్యములను తాను బహిష్కరించి యదిచాలక వానిని వెలివేయుడని యితరులను గూడగోరుచు నఱచుచున్నాడు (ఉజ్ఝపుసక్కయకవ్వం, సక్కయకవ్వంచణిమ్మియంజేణ వంశహరంప పలిత్తం, తడతడ తట్టుత్తణం కుణయి

(వజ్జలగ్గ) వాని దృష్టిలో సంస్కృతకవికి కూడు గూడ పెట్టరాదు. గీర్వాణము మాట్లాడినపుడు వెదురుకు నిప్పంటుకొన్నట్లు తడతడమని శబ్దము వచ్చునట! ప్రాకృత కవిత్వముతో మఱియొకనికి మనస్సు తనియలేదు వాడు మెల్లగా నిట్లనును. 'సుగంధి శీతలమైన యుదకము చేతవలెనెంత సేవించినను దేశికవిత్వముచే మనస్సు తనియదు (ఉయయస్స్వయ, వాసియశీయలస్సతిత్తిం నవచ్చామో (వజ్జలగ్గ) వేరొకడున్నాడు. వీడందఱికంటెను లలితుడు పాపము! వాడు లలితముగా తన భాషాభిమానము నిట్లు చాటుచున్నాడు. కాలమెన్నో వర్షములు గడచినది. కాని యిప్పటికిని ప్రాకృత కావ్యములు సుందరముగా చదువుటకును, మల్లెపూలను దండ కూర్చుటకును, గోపము గొన్న ప్రియురాలిని ఓదార్చుటకును చక్కగ నెఱిగినవారు కొందఱే!" ("పాయియకవ్వం పడిఉం, గుంపేఉం, తహాఅ, కుజ్జపసూణం, కువియంచ పసాయేవుం, అజ్జవిబహవేణయాణంతి.' (వజ్జలగ్గ) అతని దృష్టిలో 'ప్రాకృతభాషాపఠన'మొక కళ. ఈ కవి యెంత రసికుడో వాడేరుకొన్న పదార్థములే చెప్పుచున్నవి.

'గౌడవహ' మహాకావ్యకర్త 'వాక్పతి'ని గూడ నీయావేశము వదలనిది గమనించినపుడు నాకాశ్చర్యమగును. 'ముక్తకో కవులు సాధారణముగ లఘుహృదయులు. మహాకవి సముద్ర గంభీరుడు. అందునను 'గౌడవహము' ఆకాశమంత గొప్పది. అట్టి మహాకావ్య నిర్మాత వాక్పతియు, నీయావేశమునకు లొంగినప్పుడు ' నాకయ్యో పాప' మనిపించును ఆ మహాకవి రెండు భాషలను సమముగ నాదరించి మన్నించినవాడు ('ఉమ్మిల్లయిలాయణ్ణం, పయయచ్ఛాయాయె సక్కయవయాణం సక్కయ సక్కారుక్కం సణేణ, పయయస్సవిసహాఓ, (గౌడవహము) కాని యంత వానికి గూడ "సకలాశ్చేమావాచః , ప్రాకృత మహార్ణవాన్ని ర్యాంతి, తత్రైవ ప్రవిశంతి" అనక తప్పినదిగాదు. ఆ భాషల లాలిత్యమట్టిది! వానికి జీవితమున గల సంబంధమట్టిది.

ఈ దృష్టితో చూచినపుడు అందరికన్నను గొప్పవాడు సేతుబంధకారుడు ప్రవరసేనుడు. రెండు భాషలయందును అతని కవితకు తలవంపని మహాకవి లేదు. సంస్కృతముపై దురభిమానము గలవారుగూడ 'సేతుబంధ' గాంభీర్యమునకు లొంగి 'భేష భేష' అన్నారు. ఇంతటి సమర్థత ఆ భాషయందున్నను ఆదరమెంత యున్నను ప్రాకృతమును గురించి, యొకమాటయు నాతడు పలుకలేదు. (ఇచ్ఛయేవ ధణబుద్ధీ, జోవ్వణలద్ధమ్మి అహియాయియసిరీ దుఃఖం సంభావిజ్జయి, బంధచ్ఛాయాయి అహిణహి అద్ధగయీ (సేతుబంధము) "ఇచ్ఛచేత నేర్పడిన ధనబుద్ధివలె, యౌవనమున నాభిజాత్యము చెడక, సంపాదించిన ధనమువలె, బంధచ్ఛాయయందు అభినవార్థము దుష్కర"మని మాత్రమన్నాడు. ఈ మాటననుచునే 'అభినవార్ణము'ను సాధించినాడు! పై యభిప్రాయము కవితా లక్షణము. అది రెండు భాషలకును సామాన్యమే. 'సేతుబంధకారునియందున్న మఱియొక మహాగుణ మేమనగా నింత కృతకృత్యముగ గావ్యమును నిర్వహించినవాడు తన్ను గురించి కాని, కావ్యమును గురించికాని, యొకమాటయు పలుకకపోవుట! కావ్యాంతమునందాతడు "రావణవధ యితి కావ్యం,

అనురాగాంకం, సమస్తజన నిర్ద్వేషం" అని చెప్పి నిమ్మళముగ ముగించివేసెను. ఈ తపస్సు జగమునించినప్పుడు ప్రవరసేనుని హృదయమెంత గంభీరమో, ఉన్నతమో మనకర్థమే కాదు. ఒక యాశ్చర్యమే మిగులును.

ఈ ప్రాకృతములందును మరల పోటీ యారంభమైనది భాషలలో నేది యన్నిటికంటెను రమణీయము! కువలయమాలా కథాకారుడు 'పైశాచి' భాష మనోహరమన్నాడు అపభ్రంశము "సంస్కృత ప్రాకృతోభయ శుద్ధాశుద్ధ పదసమ తరంగ రంగవల్గువు"వనప్రావృడ్జలద ప్రవాహ పరిప్లావిత గిరినదీ సదృశము' సమవిషమమై "ప్రణయకుపిత ప్రియప్రణయినీ సముల్లాస సదృశము" అయినను, పైశాచి యంత కంటెను మధురమైనదట! మరికొందఱు 'అర్ధమాగధి'కి పట్టముగట్టిరి. సర్వప్రాకృతములును, అర్ధమాగధి నుండియే జన్మించుట! (ఏకరూపాహి భగవతో అర్ధమాగధీ భాషావారిదవిముక్తవారిదవత్, ఆశ్రయాసురూపతయా పరిణమతి (ఆచార్య హేమచంద్ర) వీరి దృష్టిలో సర్వ సౌందర్యమును 'అర్ధమాగధీ' భాషదే. మరికొందఱు 'మహారాష్ట్రి' సర్వమనోహరమనిరి ('మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః' (కావ్యాదర్శము-దండ్రి) ఇంతకును నేభాషమనోహరము? ఎవడు దేని వలచునో వానికది సుందరము.

ఈ ప్రాకృత భాషలను 'యిది యీ భాష' 'యిది యా భాష', యని యానాడు మనము వింగడించుకొనుట చాల కష్టము. కారణమేమనగా వ్యాకరణ సూత్రములబట్టియే విభాగించుకొనవలెను. ఆ సూత్రములు చాల పరిమితములు. అందుచే చాలమట్టుకు ప్రాచీన లక్షణకారులు నిర్దేశించినట్లు గ్రుడ్డిగా 'యిది యది' యనుకొనుటయే తప్ప వేరు దిక్కు లేదు. కొన్ని స్థూల లక్షణములు మాత్రము చెప్పికొనవచ్చును. సంస్కృత నాటకములు చాలవానిలో మనకీ కష్టముగూడలేదు. ఎందుకనగా ప్రాకృతముల విషయమున వారును మనతోపాటు గ్రుడ్డివారే సంస్కృత నాటకములు బాగుగా ప్రచారమునకు వచ్చువేళకు ప్రాకృతములు వ్యవహారరంగమునుండి యస్తమించెను. మఱియిక సంస్కృత నాటకకర్తలకేమి గతి? వారు తొలుత గద్యములను సంస్కృతమున వ్రాసి వ్యాకరణ సహాయమున వానిని ప్రాకృతీకరింతురు. అప్పుడది ప్రాకృతమో, సంస్కృతమో వారికే తెలియదు. అందుకే చాలమట్టుకు గీర్వాణ నాటకములలోని ప్రాకృతము మనకాభాషపై విరక్తిని గలిగించుటకే పనికి వచ్చును గాని రక్తిబుట్టించుటకు గాదు. ఈ ప్రాకృతమన్ననింతే, యని యపోహపడి అప్పుడప్పుడు సభలలో వానిని వెక్కిరించుటయు జరుగుచుండును. వారి దురదృష్టమునకు నేడ్వవలెనో, నవ్వవలెనో నాకర్థము గాదు 'వేణీసంహారము'నందు గొంత 'పైశాచి' యగపడును. గుణాఢ్యుడు దీనియందే 'బృహత్కథ' వ్రాసినది. బౌద్ధులలో 'స్థవిరు'లను ఒక తెగవారు గలరు. వారీ వాఙ్మయమును విరివిగా నుపయోగించిరి. 'హమ్మీర మదమర్ధన (1219-1229) మనునాటకమందును 'పైశాచి' దండిగా వాడబడినది, దీని స్వరూపమును గమనించుటకు లక్షణకారు లొసగిన శ్లోకములు దప్ప వేరు ధిక్కులేదు.

సంస్కృత నాటకములందు ప్రాకృతములను ఆ భాషా స్వరూపమును చెఱుపక వాడినవారు నల్గురు మాత్రమే, వారు అశ్వఘోష, భాస, కాళిదాస, శూద్రకులు. అశ్వఘోషుని వనికొన్ని 'నాటక విశకలిత' ఖండికలున్నవి. వానియందు సంస్కృతమును, ప్రాకృతమును గలదు. అశ్వఘోష మహాకవి చక్కని ప్రాకృతము వ్రాయుటలో నాశ్చర్యములేదు. అతడు వాని మధ్య బ్రతికెను. తాను బౌద్ధుడై వాని నభ్యసించెను. ఇట్టివాడే రెండవవాడు మహాకవి కాళిదాసు. వీరిర్వురును తమ మితిని చక్కగా గమనించి ప్రాకృతములలోని యవాంతరభేదములకు చేయి వేయక 'శౌరసేన, మహారాష్ట్ర'తో మాత్రమే తృప్తిపడిరి, అసలు భరతుడే పక్షాంతరముగ నీ నిర్ణయమును చేసినాడు (అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దేశభాషావికల్పనం సౌరసేనం సమాశ్రిత్య భాషా కార్యాతు నాటకే అధవా చ్ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః వానాదేశ సముత్థం హి కావ్యం భవతి నాటకే (భరతముని) కాళిదాసుని విక్రమోర్వశీయములో విరహవిధురు డైనపురూరవుడు కొన్ని 'అపభ్రంశ' గేయములను తన్నుతాను మఱచిపాడును. ఆ పాటలను నడుమ నెవరో చేర్చిరని యొక వాదము, కాళిదాసుని నాటకములన్నియు 'నటి' పాత్రముతో నారంభమగును గదా! అందులో గేయమును ఉండును. కాళిదాసుని స్త్రీ పాత్రలు పాడునది సాధారణముగ 'మహారాష్ట్ర' గాని మరియొక భేదమేయైన 'మాగధి' దాని వంటిదేయైన "అర్ధమాగధి" వీనితో నెక్కువ భేదము లేని 'శౌరసేని! వీనిలోని యల్పాల్ప భేదములను గనుగొనుట చాల కష్టము. ఎవడో లక్షణకారు 'డిట్లు చెప్పె' నని దాని 'నది' యనుకొనుటలో లాభములేదు గదా! అసలు లక్షణకారులే వీని స్వరూప నిర్ణయమునందొక కొలికికి రాలేదు. అర్ధమాగధీ విషయమున వారి యభిప్రాయములు గమనింపుడు -

"మహారాష్ట్రీ మిశ్రా'
అర్ధమాగధీ (సంక్షిప్తసార)
'శౌరసేన్యా అదూరత్వా
దియ మే వార్ధమాగధీ,' (ప్రాకృతసర్వస్వ)
మాగధ భాషాలక్షణం కించిత్కించిచ్చ
ప్రాకృత భాషాలక్షణం
యస్యామస్తి సా 'అర్ధమాగధీ'
'ఇతివ్యుత్పత్యా అర్ధమాగధీ' (భగవతీ సూత్రవృత్తి)

ఇక 'మాగధి' యనగా నేమి! ప్రాకృత భాషాలక్షణమును, కొంత 'మగధదేశ' వ్యావహారిక స్వభావమును, కొంత 'మాగధి'యట! ఇట్లంతయు గొడవ గొడవ! కాని ఒకటి మాత్రము స్పష్టము, కాళిదాసునిలో 'విశేషము'గ గనపడునది 'మహారాష్ట్రీ'. కొద్ది కొద్ది దాని భేదములు, 'కాళిదాసుని నాటకములు నటితో నారంభ మగుటయు దానియందు గేయములుండుటయు చూచి యొక విమర్శకుడు మూడు ప్రయోజనములను సాధించెను.

(1) స్త్రీలు ప్రాకృతమునే మాటలాడెదరు, (2) సంగీతము పురుషులకంటెను స్త్రీలకే యెక్కువ ప్రియమైనది, (3) గానమునకు పనికి వచ్చునది ప్రాకృతమేగాని గీర్వాణము కాదు అని చెప్పలేము. ప్రాకృత కథావాఙ్మయములో నెందఱో పురుషులు ప్రాకృతభేదములను భాషించిరి. జైనబౌద్ధ ధర్మగ్రంథములు చాలమట్టుకు ప్రాకృతభాషలయందే యున్నవి. మరి వారంద ఱేమి కావలెను?

'కళాప్రేమ' చిత్తవృత్తికి సంబంధించినది అందులో జాతిభేదమేమి సేయును? సంగీతమనగా నేవగించుకొను స్త్రీలెందఱో యున్నారు. పురుషులకు సంగీతమందెంత ప్రేమయో స్త్రీలనే యడుగవలెను.

గానమునకు పనికి వచ్చునది 'ప్రాకృతమే' యనుటయందును నాకు విశ్వాసములేదు ప్రతి భాషకు దాని దాని ప్రత్యేకమైన యోగ్యత యున్నది. పై సిద్ధాంతములవంటివి యొక తీవ్రమైన అభినివేశముతో తేల్చికొనెడు నూహలు. వానికి శాశ్వతమైన వెలయుండదు.

'భరతుడు' నాటకములలో చేటులు, రాజపుత్రులు, శ్రేష్ఠి, మొదలైనవారికి 'అర్ధమాగధి' వాడవలెనని కట్టడిచేసెను. దీని విషయమై పెద్ద పెద్ద వివాదములున్నవి. 'భద్రబాహువు' ఈ భాష నెక్కువ ప్రచారమునకు దెచ్చెను.

కాళిదాసు సాధారణముగ 'పాటలకు' 'మహారాష్ట్రి'ని వాడును. గద్యమునకు శౌరసేని నుపయోగించును. అపుడపుడు వచనమునకు 'మాగధి' వాడుటయు గలదు. కాని అతని 'మాగధి' అంత శుద్ధమైనది గాదు. దానికి కాలమే కారణము.

కాళిదాసుని గేయములు 'చర్చరి' మొదలైనవాని పేరులనుబట్టి పాటలనుకొనుటయేగాని, వానినిగూడ మనము శ్లోకములవలెనే చదివికొందుము. మహాకవి గేయములను ఒక విమర్శకులు కాళిదాసుని ప్రాకృత రచనలన్నియు పాటలెగనుక, 'హాలుని' సప్తశతిలోని 'గ్రథనము' అన్నియు గేయములే యనునొక సిద్ధాంతమును లేవదీసిరి. కాళిదాసుని 'ప్రాకృతము'లన్నియు గేయములేనా! యనుట తొల్త స్థిరపడవలసిన విషయము. 'హాలు'ని సంకలనములలో అనేకములు 'ఆర్యావృత్తము'లు. ఆ ఛందస్సు వానియందున్నదిగదా! లేక 'ఆర్యావృత్తము'లకే నాడు 'గేయము' లని మారుపేరా! విమర్శకులు తేల్చి చెప్పవలెను. మరి ప్రాచీనములైన చాటువులవంటి 'గాథలు'? అవియు పాటలేనా? వారినే యడుగవలెను.

ప్రాకృతములను సంస్కృత నాటకమున నెక్కువగ, మేల్పుగ వాడినవాడు శూద్రకుడు ఇతని కాలమునను ప్రాకృతములు కొంత కొంత వ్యవహారమందుండినవి. 'మృచ్ఛకటిక'లోని శకార, స్థావరక, కుంభిలక, వర్ధమానక, రోహసేన, చండాలురు 'మాగధి'ని వాడిరి. 'శాకుంతలము'లోను బెస్తవారు, సర్వదమనకుడు మొదలగువారు పలికినది 'మాగధి'. మృచ్ఛకటికలోని 'మాగధి' 'శకారి' 'చాండాలి' అనెడు అనేక భేదములను

బొందినదట! వైయాకరణులు 'శౌరసేని' యందే రెండు భేదములను ేల్కొన్నారు. ఒకటి 'అవంతి' రెండవది 'దాక్షిణాత్యము'' ఈ రెండును గొంత 'మహారాష్ట్రి'ని చేర్చికొనును. మృచ్ఛకటికలోని విదూషకుడు వాడినది 'ప్రాచ్య'యని 'పృథ్వీధరు'ని యభిప్రాయము. అట్లే వీరకుడు 'అవంతి'ని, చందనకుడు 'దాక్షిణాత్యము'ను వాడుదురు. పై యభిప్రాయము జర్మన్ పండితుడు 'పిషెల్' మహాశయుడొసగినది. శకారుడు 'శకారి' యనెడు మాగధీ భేదమును వాడును. ఇది 'యపభ్రంశ' భేదమేయని పృథ్వీధరుడనును. మృచ్ఛకటియం దింకను అవాంతరములైన ప్రాకృతవిభేదము లెన్నియో చూపింపబడినట్లు విమర్శకుల యనేకుల యభిప్రాయము. ఈ నాటకమును ఈ దృష్టిలో ఇంకను అధ్యయనము చేయవలసిన యవసరము మావంటి జిజ్ఞాసువులపైనున్నది.

యాయావరి రాజశేఖరుడు ఒక మహా సాహసమైన పనికి బూనుకొనెను. అది యాతని 'కర్పూరమంజరీ' రచనము. దానికి ప్రేరకురాలు అవంతిసుందరియేనట! కాని అతని పంథకు కాలము కలసి రాలేదు. యథాప్రకారము వ్యాకరణముల తోడ్పాటే రాజశేఖరునకును గావలసి వచ్చినది.

ఇంతకును ఈ దృష్టిలో నెంతయో పరిశ్రమ జరుగవలసియున్నది. దానికి అర్హులైనవారు పూనుకొనవలెను. (చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధమాగధీ (నాట్యశాస్త్రము))

*(పరిశోధన, డిసెంబర్ - జనవరి 1955)*

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ప్రధానతః అకలుషిత నైతిక తత్త్వానికి అద్వితీయ ప్రతీక. ఆయన వెన్నుముక అన్యభారతీయుల్లా ఎప్పుడు వంకర టింకరలు అవ్వదు. వజ్రంగా నిలబడే వుంటుంది. మాట - తలపు - చేత ఆమూడింటికి ఆయనలో ఉన్న సంపూర్ణసమన్వయం ఈ యుగంలో ఆయనలోనే చూడాలి. "నిండుమనంబు నవ్య నవనీత సమానము - పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము" అన్న నన్నయగారి పద్యము శ్రీ నారాయణా చార్యులు వర్ణనే అనుకోవాలి.

శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ

హైదరాబాద్.

ప్రశస్తకవిగా, ప్రాచ్య పాశ్చాత్య బహుభాషావేత్తగ, అత్యంత మౌలిక సాహిత్య విమర్శకుడుగ, తెలుగునాట గణతికెక్కిన డాక్టర్ పుట్టపర్తి మేధ నిజంగా పదునాల్గు భాషలకు పట్టుకొమ్మ. 1953 నుంచి నన్ను నోరారా! తమ్ముడూ అని లాలించిన అన్న ఆయన.

డా.సి. నారాయణరెడ్డి

హైదరాబాద్.